# సాంసను-దెలీలా

[నా ట క ము]




కృ తి క ర్త

భా షా ప్ర వీ ణ

మల్లవరపు జాన్ కవి




# ఒకమనవి

—o—

మహాశయులారా!

పరిశుద్ధ గ్రంథములోని "సాంసను-డెలీలా," చరిత్రను దృశ్యకావ్యంగా వ్రాయాలన్న నాచిరకాలవాంఛితం తీరింది. మతగ్రంథాల్ని ఛందోబద్ధం చేయడం కత్తిమీద సామువంటిది. అయినా – మూలానుసరణంగా కొన్ని సన్నివేశాలు సంకల్పించిన నా సాహసాన్ని మన్నింతురుగాక!

గుండెలమీద – దిగుళ్ల గోరీలు – కట్టుకొన్న నాకోసం అమృత ప్రవాహాలు పొంగించి; చీకటిలోనున్న నాకు వెలుతుర్నిచూపి ఆశలు పోయిన నా ఆత్మ విశ్వాసం రేపి ప్రతిబంధకాలు లేని ప్రశాంత వాతావరణం కల్పించి నన్నొక తెలుగు పండితునిజేసి 'అభ్యుదయో'స్తని ఆశీర్వదించిన వదాన్యశేఖరులు - నేత్ర శస్త్ర చికిత్సానిపుణులు - శ్రీ శ్రీ ముక్కామల వెంకట లక్ష్మీనరసింహరావు గారికి ఆత్మపూర్వకంగా అభినందనాలు అభినందనాలు అందజేస్తున్నా!

ఒంగోలులో 57 వ కోతకాలపు పండుగ సందర్భమున ఈ నాటకాన్ని ప్రదర్శించి - శ్రీ కొండా నారపరెడ్డి M. L. C. శ్రీ వి. సి. కేశవరావు M. L. A. శ్రీ దాసరి ప్రకాశము M. L A; శ్రీ చింతా రామచంద్రారెడ్డి M. L. A. గార్ల సమక్షంలో పండిత శాలువా నొసగి నూటపదహార్లతో నన్ను సత్కరించిన నా సహోదరులు. కె. టి. పాల్, సి. హెచ్. వి. ప్రేమానందం, ఎన్. నరసింహారావు, కె. వెంకటేశ్వరరెడ్డి, బి. ఎఫ్. ముప్పవరపు, టి. డి. ప్రసాదరావు. టి. పి. బెంజిమిన్, టి. జె. భాస్కరరావు, కె. వెంకటేశ్వర్లు, జె. రోశయ్య, టి. రాజారత్నం, ఎ. యోసేపు, జె. సంగీతరావు, సి. హెచ్. తిరుపతిరావు, ఎ. వెంకటరావు, రాలిస్టన్ పాలపర్తి గార్లకు నేనెంతో కృతజ్ఞుండను.

నన్నొక కవిగా గౌరవించి ఆదరించిన ఉదారస్వభావులు కర్నూలు గవర్నమెంట్ ట్రైనింగ్ కాలేజి లెక్చరరు, శ్రీ శ్రీ వై. జామువా M. A. M. Ed. గారికిన్ని—

పుత్రవాత్సల్యంతో నన్నుప్రేమించి సత్కరించి ప్రభువుమహిమార్థంగా ఈకావ్యముద్రణ భారాన్ని వహించిన కర్నూలు గవర్నమెంటు ట్రైనింగ్ కాలేజి లెక్చరరు, కళాపోషకులు శ్రీ శ్రీ యస్. జీవరత్నం జాన్‌గారికిని — వారి సతీమణి శ్రీమతి కెల్లి డాక్టరమ్మ గారికిని — నా హృదయపూర్వక సమస్సహస్రాలర్పిస్తున్నా!

సోదరాంధ్ర పాఠకుల, నటకుల, ప్రేక్షకుల ఆదరాభిమానాలు నాకు మరోకావ్యసృష్టికి మధురమైన హృదయస్పందనం కలిగిస్తాయని ఆకాంక్షిస్తున్నా!

—మల్లవరపు జాన్.

# పండితాభిప్రాయములు

—x—

సాంసన్ చరిత్ర బైబిల్ ప్రాచీన నిబంధనలోని న్యాయాధీశులు అను గ్రంథమున **13, 14, 15, 16** ప్రకరణములలో నున్నది. క్రీ. పూ. **1161** లో సాంసన్ జన్మించి **1120** లో మృతినొందినాడు. తండ్రి మానోహ. తల్లిపేరు లేదు. సాంసన్ భగవదనుగ్రహమువలన జన్మించి అతిలోక శక్తిగలిగి కొన్ని వీరకృత్యములుచేసి ఫిలిస్తీయులను కొన్నిసారులోడించి తన ఇశ్రాయేలీలకు నాయకుడై ఇరువది సంవత్సరములపాటు న్యాయాధీశుడుగ కూడనుండెను.

ఈకథ జగద్విఖ్యాతమైనది. మిల్టన్ "Samson Agonistes" అను పద్యనాటిక రచించెను. ప్రపంచములోని నాగరకభాషల యందెన్నిటిలోనో ఈకథ గ్రంథరూపము దాల్చినది.

ఆంధ్రభాషలో మల్లవరపు జాన్ కవి 'సాంసను' గాథను పద్యగద్యాత్మకమైన నాటకముగా రచించినాడు. ఇది మొత్తముమీద హృద్యముగానున్నది. గద్యములు పద్యములు. మధురములు. ఇందున్న గీతములుకూడ లలితములు, ఈకవి అవలంబించిన రీతి ప్రసాద సౌకుమార్యాది గుణములతో కూడియున్నది. ఇతివృత్తమంతయు పద్యమయముగా రచనచేసినచో ఎక్కువ హృద్యముగా నుండెడిది. ఈరచయిత కవితాత్మగలవాడు.

కవి క్రైస్తవ మతావలంబియైనను భారతీయుడగుటచే భారతీయ భావములకు హృదయమునకు అవిరుద్ధమైన రచన చేసినాడు. ఈగడ్డన జన్మించిన ప్రతివానికిని భారతీయ దృక్పథము అగోచరముగానుండదు.

ఈరచనను నాటకం అనుటకన్న 'Dramatic Spectacle' అనుట సమంజసము. మహావీరుడగు 'సాంసను' జీవితములోని ముఖ్యఘట్టములు కనులకు కట్టినట్లుగా చిత్రింపబడినవి. 'సాంసను' కొలదిలోపము కలవాడగుటచే 'Tragic Hero' అయి పతనమొందినాడు. తుదిలో కూడ అతని పతనము భూకంప ప్రాయమైనది.

మూలములోలేని కొన్నిపేర్లు ఈకవి ఉపయోగించినాడు. నాయకుని తల్లికి మనోరమ, భార్యకు సరోజ, ఒకసేవకునకు మీరాఖాన్ అని పేర్లుపెట్టినాడు. ఇవి కాలవ్యత్యాస దోషముక్రిందికి వచ్చునవి. 'సత్యవాది' అను పాత్ర మహాత్మా

గాంధీని తలపించుచున్నది. మూలమునలేకున్నను ఈనాటకములో సత్యవాది పాత్ర సార్థకత నొందినది.

ఈనాటకము పఠించుటకే గాక ప్రదర్శనకుకూడ యోగ్యమనిపించుచున్నది. శుభం భూయాత్ !

సాహితీ సమితి
ఒంగోలు
తే. 15–4–68

విద్యావాచస్పతి – సాహిత్యాచార్య
సాహిత్య సామ్రాట్ – కవీంద్ర
శ్రీ శివశంకర స్వామి



# శ్రీయుతులైన జాన్‌గారికి

నమస్కరించి వ్రాయునది.

తమరు దయతోపంపిన 'సాంసను – డెలీలా' అను నాటకము ఆద్యంతము చదివి యానందించితిని. వస్తువు మతగ్రంథములోనిదే యైనను తాము దానిని సరసముగాను, ఆధునికముగాను, నాటకీకరించియున్నారు. ఫిలిస్తీయుల కౌటిల్యములను, సాంసను స్వజనదాస్య నిర్మూలన వాంఛను, సత్యవాది ధర్మతత్పరతను చక్కగా చిత్రించియున్నారు. స్త్రీ లోలతవలని కీళ్ళు నాటకమున స్పష్టముగా బ్రదర్శింపబడినవి.

మొదట సరోజయు తరువాత డెలీలాయు సాంసనును మోసగించిన విధమును ఆమోసమునకు గుఱియై యతడు పరాభవము పాలగుటయు విచారము కలిగించును. సరోజా డెలీలాలకు చాల భేదమున్నది. డెలీలావలె సరోజ కేవలము స్వార్థపరురాలుకాదు. ఆమె యుద్దేశము మంచిదేకాని యది భర్త కవమానమును కోపమును గలిగించినది.

మంగలిపాత్ర హాస్యమున కిరవైయున్నది. దేవుని కరుణామయతకూడ ఈనాటకమున చక్కగా ప్రకటితమగుచున్నది. కామ పరవశుండు కాకుండినచో సాంసను ఫిలిస్తీయులను జయించి యుండెడివాడే. కాని ఆలోపముచే నతడు భగవద్దయా పాత్రుడయ్యు తన్ను ఫిలిస్తీయులనుకూడ చంపుకొనవలసివచ్చినది.

మీపద్యములు సరసములు సరళములై నాటకోచితములుగా నున్నవి. నాటకమున కాలైక్యముండుట కవకాశము లేక పోయినను సంభాషణలు సన్నివేశములు మనోహరములుగానున్నవి. ఎడనెడ పాత్రోచితముగా ప్రయుక్తమైనను తమభాష దోషరహితము సర్వసుబోధమునై యొప్పుచున్నది. తామింకను సరస మధురములైన కావ్యముల రచించి ఆంధ్ర నలంకరింతురని ఆశించుచున్నాను. నాటకము ముందున్న పద్యములు తమకృతజ్ఞతను చక్కగా వెల్లడించుచున్నవి.

డాక్టరు - దివాకర్ల వెంకటావధాని
ఎం. ఏ (ఆనర్సు) పి. హెచ్. డి.
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు.

హైదరాబాదు
తే. 17—4—68

మీ 'సాంసను – డెలీలా' నాటకమును ఆద్యంతము చదివితిని. మీకల్పన బాగుగానున్నది. మీపద్య రచన మిక్కిలి మెత్తగా నున్నది. సుఖముగానున్నది. మంగలి పాత్ర కల్పన ఉచితముగానున్నది. కొన్ని ప్రసంగములు లోకోక్తులు గడుసుగానున్నవి. మీకు ఆశీస్సులు –

విజయవాడ,
తే. 12–4–68

కవి సమ్రాట్ – కళాప్రపూర్ణ
విశ్వనాథ సత్యనారాయణ



V

సోదర కవిప్రియులు, **యం. జానుకవి గారికి**

తా మంపిన 'సాంసన్–డెలీలా' అను నాటకరాజము నందుకొంటిని. ఓపిక తక్కువగా నున్నందున 'ఎడ్లపల్లి సామ్యూల్' కవిగారు చదువుచుండగా వింటిని.

జీవకళలతో నేడు ప్రపంచము సుత్తురాతలూపు చలనచిత్ర సదృశ రీతులతో మధురభావాలతో నగిషీపని తనంపు పదాల వజ్రాలతో రచింపబడి ప్రచురింపబడిన మీ 'సాంసను-డెలీల' నాటకరచనా విధానమెంతో ప్రశంసనీయమైనది. ద్రాక్షాపాకమున కీనాటకము మల్లెపూదోట నిహారము.

ఇశ్రాయేలీయుల తెగకుచెందినవాడు సాంసను. ఫిలిస్తీయుల తెగకు చెందినది డెలీలా. అయ్యిరువురకు ప్రేమదాంపత్య మేర్పడినది. రెండు తెగల వారికి వర్ణాఖీల భేదముకలదు. అక్కారణంబున సాంసను స్నేహబాంధవ్యముపై రోతజనించి నయనంబుల నూడబెఱికించి చంపప్రయత్నించిన విషాదఘట్టమును పఠించునపుడు షేక్స్పియర్ 'ఒథెల్లో' కొప్పరపు సుబ్బారావుగారి 'రోషనార' అను శృంగార వీరనాటకంబులు జ్ఞాపకమునకువచ్చి నాహృదయమును కలగుండు పఱచినవి.

సందర్భానుసారంబుగా 'మిల్టన్' మహాకవిచే వ్రాయబడిన " Paradise Lost " అను కావ్యభావంబులందు రామణీయకముగ పొందుపఱచబడిన వనుటకు కవిగారి దూరదృష్టి భావనాశక్తి లోకమునకు విదితమగుచున్నది.

"పరుషోక్తుల్ వచియించి సైనికులచే బాధించితిన్" అను పద్యాంత భాగము క్రీస్తునాథుని శ్రమలను తెలియబఱచుచున్నది.

అచ్చటచ్చట గిడుగు రామమూర్తి పంతులుగారి, గురజాడ అప్పారావు పంతులుగారి నవ్యసాహిత్య ధగద్ధగలు బొడగట్టుచున్నవి.

సాముగరిడీలు - ఎవ్వరిదానవే కువలయేక్షణ – అని ప్రయోగించుటలో పెద్దన్నగారి పోకడలతో కొంత చెల్లాటలాడుకొనినాడు.

"లోకాతీత పరాక్రమోజ్జ్వలిత సుశ్లోకుండనై" అను పద్యము చదువుకొను నప్పుడెల్ల శ్రీనాథ మహాకవిగారి మధురసమాసంబులు జ్ఞాపకమునకు వచ్చుచున్నవి.

“కన్నులు దీసినారు, వడిగా చెఱసాలను ద్రోసినారు” అను పద్యరచనా విధానమాధుని కాంధ్ర మహాకవుల జాబితాకు చెందినవాడు జాను కవిగారని నిరూపించుచున్నది.

“విలసిత పుష్పముల్ మదికి విందొనగూర్చు పదార్థజాలముల్” అను పద్యమందు పచ్చి శృంగారరసము పోషించినాడీ రసిక కవివరుండు.

వెలయాలి పాత్రొకనాడగ్నివర్షంబును గురిపించి ధనహీనునిగా జేసి దుష్కీర్తిపాలుగావించి మరణచ్ఛాయలకు దారితీయునని యీనాటకము లోకమునకు నీతిబోధించుచున్నది.

విద్వత్సార్వభౌములు, దయార్ద్రహృదయులు పూజ్యశ్రీ డాక్టరు ముక్కామల వెంకటలక్ష్మీ నరసింహారావు పంతులుగారి ప్రేమోపదేశానుసారంబుగ, విద్యావివేక సంపన్నులు, శ్రీ యస్. జీవరత్నము జాన్ పుణ్యదంపతుల త్యాగసౌశీల్యాద్యోవీధుల విహరించుచు, ఆనందదాయకంబులగు కబ్బంబుల రచించి అధఃపతితమగు నిజజాతిని మేలుకొలుపు వీరగీతంబుల నాలాపించుచు, ఆయుర్దాయముగల్గి సాధ్వీమతల్లియగు మీసతీమణితో క్రొంగ్రొత్త కబ్బపుంగన్నియు కల్పక కీర్తి కర్పూర పుష్పంబుల గీలించి తెలుగు దర్బారులందూరేగుదువుగాత!

గోకనకొండ — ‘కవిశేఖర’ ‘సుకవిరాజ’

తే. 20-4-68 — కవిమార్తాండ — జి. జోసపు

శ్రీ 'మల్లవరపు' సత్కుల
సోముని మధురాతి మధుర సుందర కవితా
శ్రీ మన్మూర్తిని జాన్‌కవి
ధీమంతుని బ్రోచుగాక ! దేవుడు కరుణన్ ;

తేనెలు సోనలై కురియు తెల్గున కమ్మని గద్యపద్యముల్
పూనికఁ బెంపమీకు నిడెపో! యజురాణివరమ్ము; లేనిచో
మానసమున్ ద్రవింపగల మాధురితో రచియింపనేర్తువే
జానుకవీంద్ర ! సాంసను ప్రశస్త చరిత్రను నాటకంబుగాన్;

మీ 'సాంసను డెలీల' మిహిక సువాసనల్
నాస్తిక దుర్గంధనటన బాపు !
మీ 'సాంసను డెలీల' మేలిమి దీపికల్
దుర్బోధతిమిరంబు దొలగజేయు !
మీ 'సాంసను డెలీల' మేదురవాయువుల్
కుటిలవాదన మేఘపటలమడచు !
మీ 'సాంసను డెలీల' మీమాంస చంద్రికల్
ఘోరతాపమ్మును బారజిమ్ము

కవివసంతమ ! మేల్మి వాక్యములతోడ
'సాంసను డెలీల' కొకదివ్యసౌధమిందు
గట్టినారలు రవియెంత కాలమెలమి
వెలుగునందాక భువినది నిలచుగాత !

పా ది లి.
తే. 23–4–68

"సహజకవి", "కవిసింహ"
గిద్దలూరి వెంకటేశ్వర్లు



జంధ్యాల పాపయ్యశాస్త్రి "కరుణశ్రీ"
ఆంధ్రోపన్యాసకులు :
ఆంధ్ర క్రిష్టియన్ కాలేజీ

కల్యాణ భారతి
రవీంద్రనగరం - గుంటూరు.
15–5–68

అయ్యా!

మీరు పంపిన "సాంసను–డెలీలా" నాటకము చేరినది. మీదృశ్యకావ్యమున కల్పించిన సన్నివేశములన్నియు రంగస్థలోచితములై రమణీయములై యున్నవి. మీపద్యరచన రసవంతమై సకలసుందరములై ముందుకు సాగినది "గాండ్రించి పైదూకు", "కన్నులుదీసినారు", "ఎఱ్ఱసముద్రంబు", "ఎక్కడి కేగినన్ విడుతునే" మొదలగు మీపద్యములన్నియు నాటకోచితశైలితో నడచినవి. మీరు పెద్దలవద్ద శుశ్రూషచేస కష్టపడి సముపార్జించిన కవితను సద్వినియోగము చేయుచున్నందుకు చాలసంతోషము. 'సాంసను' వంటి ప్రపంచవీరుల వీరగాథలు నేఁటి దేశమునకు చాల ఆవశ్యకము. మీరు ఇటువంటి రచనలు ముందు ముందు మఱింత శక్తిసామర్థ్యములతో సాగింపవలెనని భగవంతుఁడు మీకు చిరాయురారోగ్యము లొసంగవలెనని ఆకాంక్షించుచున్నాను. కృతిపతిప్రశంసలోని "అనసూయాది", "ఈయమ్మ చలువగాదే" అన్నపద్యములు హృద్యములు మీకృతిపతి కృతార్థుఁడు.

— కరుణశ్రీ

## శ్రీ జాను కవీ! ఆశీస్సులు

జాను తెలుగు పదాలతో ముద్దులొలుకుచున్న నీ "సాంసన్-డిలైలా" నాటకం చదివి సంతసించాను. ఆంధ్ర క్రైస్తవ కవులలో నిర్దుష్ట రచనా పాటవంకల నీకలం మున్ముందు మధురకావ్యాలను పల్లవించి యశస్సు నార్జించగలదని ఆశిస్తాను. నీకు చిరాయువగుగాక.

భవదీయుడు
నవయుగ కవి చక్రవర్తి
**జి. జాషువ**
గుంటూరు
15–6–68

# తప్పొప్పుల పట్టిక



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ఒకమనవిలో | 20 | ఆదిరించిన | ఆదరించి |
| కృతిపతిప్రశంసలో | 13 పద్యము | మదినెఱింగి | తలచిగా |
| 16 పేజి | చివరిపద్యము | సముచింతులై | సముదంచితులై |
| ,, | ,, | హాహానిని | హానిని |
| 30 పేజి | 1 పంక్తి | ఈలుటి | ఈనాటి |
| 66 ,, | 1 ,, | స్వేచ్చా | స్వేచ్ఛా |

# కృతిపతిప్రశంస

—o—

సిరుల కిరవైన కర్నూలు పురమునందు
వెలయు ట్రైనింగ్ కాలేజి కళ వహింప
ఆంగ్ల బోధన జేయు మీకంజలింతు
జగతి శ్రీ "జీవరత్నము జాన్" వరేణ్య !

కావ్యపురాణముల్ గఱచితి కష్టించి
వెంకట సుబ్బయ్య విభునిచెంత
వ్యాకరణవిశేష సాకర్యమరసితి
శఠకోపముని దయాసరసిదేలి
కవితారహస్యంబు గనుగొంటి 'కవిరాజు'
సత్యనారాయణ సమ్ముఖమున
నవరస పరిపోషణ విధానమెఱిగితి
శివశంకర స్వామిచెంతజేరి

పెద్దల కటాక్షమున కొంతపేరుమోసి
కవులపట్టికలో జేరగలిగినాను
కాని ఫలమేమి ? నాముగ్ధ కావ్యములను
అచ్చుబోయించు దాత కర్వయ్యెనేడు

సంస్కృతాంధ్రములందు భాషాప్రవీణ
పట్టమునుపొంది విపులాంధ్ర భారతాంబ
సేవజేసి కవిత్వంబు చెప్పగలిగి
ఆదరణలేక దుస్థితి నందవలసె !

కవుల కక్కర లక్షలు కాన్కలిచ్చి
భూషితులజేయు కాలంబుపోయె ! నకట
కవితజూపి యాచించినగాని నేడు
కుక్షినిండార దొరకునే ! భిక్షమైన !

ఒకపరి మీరొసంగిన బహూకృతిగైకొని యంతులేని కౌ
తుకమున పొంగిపోయి పరితుష్టి వహించితి, కృష్ణరాయలే
ప్రకటిత గండపెండెరము పాదమునన్ దగిలించి యేన్గుపై
సకల సగౌరవోత్సవము సల్పినరీతిగ సంతసించితిన్ ;

ఎనిమిదిమంది బిడ్డల మహిన్గని రుద్ర దరిద్రదేవితో
బెనగుచు కావ్యరాజములు పెక్కురచించి క్షుధావ్యథార్తిచే
తనువు కృశింప – సాయపడు దాతలటంచు దలంచి మీదు ద
ర్శనమున కేగుదెంచితిని; శాంతిశుభోదయ ! జాన్ మహాశయా !

అనసూయాది పతివ్రతామణులకక్కై భర్తృ పాదాబ్జ సే
వనమే జీవితలక్ష్యమంచెఱిగి భవ్యజ్ఞానతేజో విలా
సినియై, పుట్టినమెట్టినిండ్లకును వాసిన్గూర్చి సద్వైద్య వృ
త్తిని రంజిల్లెడు తల్లి 'కెల్లిని' సభక్తిన్ మ్రొక్కి కీర్తించెదన్

ఈయమ్మ చలువగాదే ! నాదు మాంగల్య
మూడక గళమునందుండగలిగె !
ఈతల్లి ప్రేమగాదే ! నాకుమారుండు
బ్రతికి ప్రాణాలతో బట్టగట్టె ;
ఈమాత కరుణగాదే ! నాసహోదరి
ప్రసవవేదననుండి బయటబడియె :
ఈదేవి వరముగాదే నాకు బిడ్డలు
కలుగని దోషంబు తొలగద్రోసె ;

ఈజనని వైద్యమునగదా ! యింతదనుక
సుఖముగా నుంటిమనిపల్కి సుదతులెల్ల
దైవపూజలలో నిన్నుదలచుకొనరె !
డాబెరుంగని మా 'కెల్లి' డాక్టరమ్మ

ఎక్కడనో జనించి పరుగెత్తి సముద్రునిగూడి తద్రుచిన్
గ్రక్కునబొంది లీనమగు గంగ విధంబున 'కెల్లిమాత' మీ
యక్కునజేరి మీవలె నిరాశ్రయులన్ గరుణించి క్రీస్తుపై
నెక్కువ భక్తిగల్గిమనదే ! కనుపించని త్యాగశీలయై ;

సతిపతికి మనస్తత్వంబులతికియుంట
కాంచలేదమ్మ దాతృత్వకార్యమందు
అయ్యగుప్పిలివిప్ప మీరంతలోన
చెయ్యిపైకెత్తి దానంబుచేయుచుంద్రు

నాకవనంబులోగలుగు నాణ్యమెఱింగి శిరంబులూపి వ
హ్వా కవిశేఖరా! యనుచు వట్టికరంబులజూపువారి నే
నీకలికాలమందు దిలకించితి; మీవలెనింత ద్రవ్యమున్
నాకిడి గ్రంథముద్రణమునన్ తలదూర్చిరె? ఎవ్వరేనియున్;

కష్టపడి విశ్వశుభములకై రచించు
తెల్గుకవితలు పెట్టెలో మూల్గదగునె!
ధనికుడొకయేడు సిగరెట్లు తగులబెట్టు
వెచ్చమే చాలు నొకకావ్యముచ్చువేయ

సప్తసంతానములయందు శాశ్వతముగ
నిలచునది సత్కృతియటంచు మదినెఱింగి
కృష్ణరాయలు పెద్దన్నకృతిని బొంది
నిర్మలయశంబు జగమున నింపుకొనియె,

మానుగను జీవరత్నము
జానభిధానుండవీవు - జననుత! నేనున్
జానను పేరంబరగితి
గాని! ఫలంబేమి? ఆర్థికముగ నలిగితిన్;

క్రీస్తురక్తబాంధవ్యమెుకిం తదెలిసి
నామసామ్యమహత్తు మనమునదలచి
దైవకృపచేత మీసన్నిధానమందు
సరగ మత్కృతి పఠియించి సంతసింతు;

మీకీర్తియు నాకీర్తియు
ప్రాకటబుధలోకమందు - ప్రస్తుతికెక్కన్
నా కృతికన్యను గైకొని
అకల్పాంతము శుభంబులందుమ జగతిన్.

—రచయిత

చీమకుర్తి
5-1-1967

భాషాప్రవీణ మల్లవరపు జాన్

## పాత్రలు.

– పురుషులు –

రాజు – (ఫిలిస్తీయుల ప్రభువు)
మంత్రి – (ఫిలిస్తీయుల మంత్రి)
బాలసాంసను – (12 సం॥ లోపు)
సాంసను – (కథానాయకుడు)
1వ సర్దారు }
2వ సర్దారు } (సైన్యాధికారులు)
సత్యవాది — దేశసేవకుడు
మానోహ — సాంసను తండ్రి
దేవదూత —
తిమ్నాతీయుడు – సాంసను మామ
మిరాఖాన్
1వ. పౌరుడు
2వ. పౌరుడు
మంగలి
భటుడు

– స్త్రీలు –

మనోరమ:– (సాంసను తల్లి)
సరోజ:– (సాంసను భార్య)
డెలీలా– (వేశ్య)

## స్తుతిగీతము

జగదీశ్వర వరదాతా ... నుత పాప విరహితా! విధాతా ॥ జగ ॥
భయదూర - విఘ్నపరిహారా - పరమార్ధ సుమనోవిహారా!
సాధుశాంత హృదయా ! దయామయ !
జయ జగదీశ్వర ! జయ జగదీశ్వర !
జయ, జయ, జయ, జగదీశ్వర ! వరదాతా !
నుత పాప విరహితా ! విధాతా ॥ జగ ॥

# సాంసను - డెలీలా

## ప్రథమాంకము

### మొదటి రంగము

(తెరముందు సర్దారులు సత్యవాదిని బంధించి తీసికొనిపోవుచుందురు)

సత్యవాది:—

—: కీర్తన :—

నరకయాతన తొలగించుదేవా !
నాచేయివిడిచావా ! దేవా !
నన్నుబ్రోవగా రావా ... ॥ నరక ॥

I దేశద్రోహినని - మోసకారినని
నిందించి - బంధించారే !
నిజమునెఱింగిన - నీవేనన్ను
నీహస్తమున దాచగాలేచిరావా ॥ నరక ॥

II శాంతిజీవితము - నాశించినాను
శ్రమలనెన్నో - భరియించినాను
భేదభావముల బూదిచేసి
నీప్రేమచూపించగా రావ ! దేవా ॥ నరక ॥

(సర్దారులు, సత్యవాది నిష్క్రమింతురు)

(తెరయెత్తగా - ఫిలిస్తీయుల రాజు, మంత్రి సింహాసనాసీనులైయుందురు)

రాజు:— మంత్రివర్యా ! సకలలోక రాజన్య సంపూజితమై సర్వసంపత్సమేతమై మనఫిలిస్తీయ సామ్రాజ్యము విస్తరిల్లుచున్నదిగదా !

మంత్రి:— ప్రభూ ! జగదేకవీరుండవై భుజబల పరాక్రమ సాహసోపేతుండవై దైవజనులమని విఱ్ఱవీగు ఇశ్రాయేలీయులను సైతము పాదాక్రాంతులనుగాజేసిన తమ ప్రభుత్వమున సామ్రాజ్య విస్తరణకేమి లోటున్నది ?

రాజు:– రాజులెంత పరాక్రమవంతులైనను రాజ్యాంగ రథసారథులైన మీ వంటి మంత్రిపుంగవుల సహాయములేనిదే మెఱుగుపెట్టని బంగారము వలె ప్రకాశింపజాలరు.

మంత్రి:– దేవరవారికి నాయందుగల ఆదరాభిమానములకు నేనెంతయు కృతజ్ఞుడను.

రాజు:– అమాత్యవరా ! మనరాజ్యమున ......

* సమధికమైన మావిజయశాసనముల్ తలదాల్చి యందఱున్
క్రమముగనున్నవారె? త్రిజగన్నుతమై మన రత్నకోశముల్
భ్రమగలిగించునే? రిపులబట్టి వధించిన వీరులెల్ల సౌ
ఖ్యముల తరింతురే ? నిజముగా వివరింపుము మంత్రిసత్తమా!

మంత్రి:– మహారాజా ! శత్రుగజ కంఠీరవులైన సజాతీయుల కన్నబిడ్డల వలెకాపాడు మీపాలనమున నేకొఱంతయులేదు; కాని... .....

రాజు:– కాని...అని వాక్యము నసంపూర్ణముగా ముగించితి రెందులకు? మీ సందేహమేదో విన్నవించుడు.

మంత్రి:– ప్రభువరేణ్యా ! పరాజితులైన ఇశ్రాయేలీయులు కోఱలూడిసిన పాములవలెనుండి తమ శాసనములీనాడు తలదాల్చుచుండిరేగాని కాలగమనమున బలము చేకూరినచో వారిని పట్టపగ్గములుండవు. ఇశ్రాయేలీయులు పూర్వముచేసిన దుండగములేమని చెప్పుదును ;

* అతిశూరులైన 'మోయాబీయులను' దాకి
పదివేలమందిని బట్టిచంపె ;
ఇనుపరథంబులనెక్కి మీసము దీటు
'సీసెరా' సేనల చిత్తుజేసె ;
దర్పంబు గదుర 'మిద్యానీయుల' నెదిర్చి
కదనరంగంబున గావుదీసె
మునుకోలలనుదాల్చి మన ఫిలిస్తీయుల
నాఱువందలదాక హతమొనర్చె ;

కాలవశమున నేడు మీయేలుబడికి
ఇశ్రయేలీయులెల్ల నిరాశ్రయులయి
సమ్మతించిరి; వారిని నమ్మియుండు
టగ్నిగొని వస్త్రమునగట్టినట్లు గాదె!

అదియునుగాక ఇశ్రాయేలీయులిప్పుడు మనకు బానిసలుగా నుండినను తరతరములనుండి వారిలో జీర్ణించుకొనిపోయిన విద్వేషము శమీవృక్షము నందగ్నివలె దాగియున్నది; వారినొక కంటకనిపెట్టి యుండుటయే శ్రేయో దాయకము.

రాజు:— సాయంకాలపు సూర్యబింబమువలె తేజోవిహీనమైన ఇశ్రాయేలు జాతి మనలనేమి చేయగలదు? వంటయింటి కుందేళ్ళవలె నున్న? వారిని ఎన్నివిధములనో హింసించితినిగదా!

* పరుషోక్తుల్ వచియించి సైనికులచే బాధించితిన్; ముండ్లపై
పరుగెత్తింపగజేసితిన్; రుధిరసంపాతంబు గావించితిన్;
చెఱసాలన్ బడద్రోసితిన్; తనువులన్ జీర్ణింపగాజేసితిన్;
శిరముల్ద్రుంచితి; నిశ్రయేల్జనుల కన్నీరేఱులై పాఱగన్;

మంత్రి:— దేవరా! కుక్కతోక చక్కజేయ సాధ్యముకానట్లు ఇశ్రాయేలీయులనెంత హింసించినను ప్రయోజనమేమున్నది; వారిలో మానసిక పరివర్తనము కలుగవలయునుగదా!

రాజు:— నిజమే! ఇశ్రాయేలీయులను మీరుపేక్షింపక వారి కార్యకలాపముల గమనించుచు తగిన చర్యగైకొనుడు;

మంత్రి:— ప్రభూ! మన ధనాగారముల పెంపుజేయుటకును ఇశ్రాయేలీయుల మానసిక ప్రవృత్తుల నెఱుంగుటకును మన సర్దారుల నియమించితిని; వారు వచ్చినగాని వివరములు బయల్పడవు.

రాజు:— ఎవడురా! అక్కడ?

మీరాఖాన్:— హుకుం సర్కార్!

రాజు:- మన సర్దారులను వెంటనే తోడ్కొనిరమ్ము

మీరా:- చిత్తం.

(మీరాఖాన్ తెరలోపలికిపోయి ధనముగల సంచులు చేతనున్న

ఇద్దరు సర్దారులతో ప్రవేశించును.)

సర్దారులు:- ప్రభువులకు ప్రణామంబులు; మంత్రివర్యులకు నమస్కారములు.

రాజు:- సర్దారులారా! మీచేతులనున్న ఆసంచులేమిటి?

1 సర్దా:- మహాప్రభూ! మన ధనకోశముల నభివృద్ధిచేయుటకు తమ ఆజ్ఞానుసారముగా ప్రోపుచేసిన ధనము నీసంచులతోనింపి తెచ్చితిమి;

2 సర్దా:- ఈ ధనము గాజా పట్టణమునుండియు ఈ ధనము తిమ్నాతు పట్టణమునుండియు సేకరించితిమి; ఏలినవారు స్వీకరింప వేడుకొనుచున్నాము.

(ధనపుసంచులు రాజు పాదములచెంత ఉంచెదరు)

రాజు:- సర్దారులారా! మీరింత ఆలస్యముగా వచ్చుటకేమి కారణము?

1 సర్దా:- ధనము సేకరించుటలో నొకింత యాటంకము తటస్థించినది;

మంత్రి:- ఇశ్రాయేలీయులెవరైన మిమ్ము వ్యతిరేకించిరా?

2 సర్దా:- వ్యతిరేకించుటకు వారికి గుండెలెక్కడివి ప్రభూ!

కోఱలూడిన పాముల గుంపువోలె
కదలనేరని ముసలి సింగముల పగిది
గొనబు రెక్కలు తెగిన పక్షుల విధాన
బ్రతుకు వారెట్లు మము నష్టుపఱచగలరు?

రాజు:- మఱి! మిమ్మాటంక పెట్టినదెవరు?

1 సర్దా:— ప్రభూ ! మన స్వజాతీయుడే ! అతనిపేరు సత్యవాదియట ;

రాజు:— ఆ ... మన ఫిలిస్తీయుడే ! మనశాసనముల నుల్లంఘించెనా? అతని నేల విడిచివచ్చితిరి ;

2 సర్దా:— విడిచిరాలేదు ప్రభూ! వానిని బంధించి ద్వారముకడనుంచి వచ్చితిమి; దేవరవారి సెలవైన నిప్పుడే వానిని రప్పింతుము.

రాజు:— (మీరాఖాను వైపుచూచి) ఆ దుష్టుని వెంటనే ప్రవేశపెట్టుము.

మీరా:— హుక్తుం మహారాజ్ !

(మీరాఖాన్ లోనికేగి సత్యవాదితో ప్రవేశించును)

(సత్యవాది ప్రవేశము)

సత్యవాది:— మహాప్రభువులకు నమస్కారములు

రాజు:— ఎవడవురానీవు ? మా పరిపాలనలో మా శాసనములనే ధిక్కరించితివట. నీకు బ్రతుకుపై నాశలేదా !

సత్య:— ప్రభూ ! తొలుత నామనవి చిత్తగించుడు; ఈ సర్దారులు ధనము సేకరించుటలో ఫిలిస్తీయుల నుపేక్షించుచు ఇశ్రాయేలీయులను హింసించుచుండిరి. వారా హింసలకు తాళజాలక యిష్టదైవమగు యెహోవా దేవుని ప్రార్థింపగా - మాదేవతను ధ్యానింపవలెనని ఆనతిచ్చి వ్యతిరేకించిన వారి నాలుకలు కాల్పించుచుండ నేనా ఘోరదృశ్యమును కంట్లారజూచి పాలకులు ప్రజలనిట్లు బాధించుట పాడిగాదంటిని. ఇందునేజేసిన నేరమేమున్నది ప్రభూ !

రాజు:— ఓరీ పాలకుల విమర్శించుట నేరముకాదా!

లోకాతీత పరాక్రమోజ్జ్వలిత సుశ్లోకుండనై ; పార్థివా
నీకైశ్వర్య కళా సమర్చితుడనై ; నిర్వక్ర ధీశాలినై
శ్రీ కళ్యాణప్రదాతనై దనరు మాచేతల్ విమర్శించుచున్
మాకే నీతులు చెప్పవచ్చిన నినున్ మన్నింపగా వచ్చునే !

సత్య:- రాజా ! ప్రభువులు ప్రజానురంజకముగా పాలింపవలయును గాని ప్రజలనిట్లు పీడించుటతగునా ?

* పేదలైవిలపించు వివిధ జాతీయుల
కన్నబిడ్డలరీతి గాంచవలదె !
శిక్షలీయని ఫిలిస్త్రీయుల విడిచి ; యి
శ్రా యేల్జనులనేచ న్యాయమగునె !
ఇష్టదైవమును ధ్యానించిన గోపించి
దేవతన్గొల్వ బాధింపదగునె !
బలహీనులై పట్టుబడినంత మాత్రాన
బానిసీలను జేయ భావ్యమగునె !

సముచితానంద స్వేచ్ఛా ప్రసన్నకలిత
భావముల జీవితములందు పాదుకొల్పి
ప్రజల కష్టసుఖంబుల పంచుకొనుచు
పాలనము సేయువాడె, సత్ప్రభువరుండు

మీకు బానిసవృత్తి చేయుటకే ఇశ్రాయేలీయ జనాంగమును దేవుడు సృష్టించెనని తలంచుట పొరపాటు: ఎండవానలనక కండలు గరగించి బండ చాకిరిచేయు గండుపేదల కన్నీటి ప్రవాహములో మన సిరి సంపదలు నిలుచునా ! ప్రభూ ! ప్రజాశక్తి బలమైనది. దాని నణచుటకు ప్రయత్నించుట ధర్మముగాదు ;

మంత్రి:- ఓయీ ! ధర్మాధర్మములు నిర్ణయింపవలసినది ప్రభువులు. కుక్క పెత్తనము గాడిద వహించినట్లు నీకెందుకీ ధర్మచింత.

సత్య:- అయ్యో ! వివేకవంతులగు మీరే యిట్లు మాటలాడిన నేనేమన గలను. ఇది నా జన్మభూమి, జన్మభూమిపై శాంతిభద్రతలకు భంగము వాటిల్లినపుడు సామాన్య మనుజుడైనను సహింపజాలడు గదా! బాధ్యతగల ప్రభువులు మీరు పట్టించుకొనకుండుట కడు శోచనీయము.

రాజు:- ఓరీ ! పరిపాలనా దక్షులమగు మాబాధ్యతలు మేమెఱుగమా ?

* వేసముదాల్చి నీతులనువిప్పి ప్రబోధముసేయు దొంగ స
న్యాసివినీవు ! నేనొక మహాప్రభు చంద్రుడ నంచెరింగియున్
త్రాస మొకింతలేకిటు వితర్కములాడుట హానిగాదె ! మా
శాసనమెట్టిదైన శిరసావహింపవలెన్ గదా ! జనుల్;

సత్య:– ప్రభూ ! శాసనములు సరియైనవైనచో శిరసావహింపవలసినదే ! కాని ...

* నవ్యమణిమయ సింహాసనముల నెక్కి
చేసినప్రచండమగు పిచ్చి శాసనముల
నమ్మి తలదాల్చు పెట్లు ప్రాణమ్ములున్న
మనుజులము - దేశమున వట్టి మట్టియగునె ?

మంత్రి:– ఓరీ ! దౌర్భాగ్యుడా !

* సుద్దులుజెప్పి మమ్మణచ జూచిన నీకుటిల ప్రవర్తనం
బద్దమునందుపోలె మనుజాధిపుసన్నిధి గోచరించె; నీ
కెద్దియొ దండనంబు విధియింపకతప్పునె ? యిప్పుడైన నీ
నిద్దురకండ్లువిప్పి ప్రభునిన్ శరణన్న క్షమించి బ్రోవడే !

సత్య:– ప్రభూ !

* శరణముజొచ్చి మీవలన సంపదలన్ గడియింపనేను దు
ష్కరితుడగాను ; సర్వజనశాంతిసమత్వము నాశయంబుగా
శిరమునదాల్చి నాయనుగు జీవములన్ బలిజేయనున్న నన్
చెఱలనుబెట్టినన్ భయముజెంది మనస్సును మార్చుకొందునే !

సమయానుకూలముగా వర్తించి యేయెండ, కాగొడుగు-పట్టు స్వార్థపరులకు మీరుచెప్పినది రుచించునుగాని పరులకు సేవజేయు నావంటివానికి రుచించును?

1 సర్దా:– ఔనౌను ! రోగికి పథ్యాన్నమేల రుచించును ?

2 సర్దా:– పట్టిమాటలతో వీనిరోగము కుదురదు.

సత్య:— అధికార మదోన్మత్త పిశాచమావరించిన దొరలు కన్నులుండియు కనలేరు; వీనులుండియు వినలేరు; సుగుణవంతుల బహిష్కరించి స్తోత్రపాఠకుల మన్నింతురు. ఎంద్రకాయలవలె వ్యవహార మార్గమున నడ్డముగా నడతురు. నిజముగా నిదియొక పెద్దరోగమనియే చెప్పవచ్చును.

మంత్రి:— ఓరీ ! దేశద్రోహీ ! పాలకులమగు మమ్ము పరిహసింతువా !

* కాయమువంచి చెమ్మటలుగార్చి దినాంతముదాక కష్టమున్
జేయగలేక దేశమున చిచ్చురగిల్చెడి దుండగీంద్రకున్
నాయక ! మా ప్రభుత్వ పరిణామ నిరోధక మాచరింప నీ
కాయువు మూడెనేమొ ? చెలగాటమె భగ్గునమండు నిప్పుతో;

సత్య:— దేశాభ్యుదయమునకు దీక్షవహించి ప్రజాక్షేమమునకు నడుముకట్టిన నాడే నా ప్రాణములపై నాశవీడితిని; మంచివారి కీలోకమున తావు లేదని నేనెఱుగుదును "పాపీ చిరాయుః సుకృతీ గతాయుః" అను లోకోక్తిని మీరును వినియుందురుగదా ! పరమాత్ముడిచ్చిన ప్రాణముల పరహితార్థము బలిపెట్టు భాగ్యమందఱికి లభించునా ! కానిండు ! మీయిష్టానుసారముగ నన్ను శిక్షింపుడు.

మంత్రి:— వీడెవడో జగమొండివలె నున్నాడు.
రాజు:— అమాత్యవరా !

* కొఱవితోడను తలగోకి కొన్నయట్లు
మనదు శాసనముల విమర్శనముచేయు
దుష్టచారిత్రు డీ దేశద్రోహికిపుడె
సరగ శిక్షవిధింపుమా ! సచివముఖ్య!

(రాజు నిష్క్రమించును)

మంత్రి:— ఈ దేశద్రోహికి ఆరుమాసములు కఠిన శిక్ష విధింపబడినది. చెఱసాలలో బడవేయుడు. (మంత్రి నిష్క్రమించును)

సర్దారులు:— చిత్తము. (సర్దారులు పట్టుకొని పోవుచుందురు.)

మీరా:— రెండోమన్సి హిట్లా నామర్దాపని సెయ్యకుండా అచ్చాగా బుద్ధి సెప్పినార్. (తెరపడును)

# ప్రథమాంకము

## రెండవ రంగము

(మనోరమ గృహము, దైవధ్యానము చేయుచుండును.)

మనోరమ:—

—: కీర్తన :—

యెహోవా! నామొఱ వినరావా!
నన్ను పరితాపమున నుంతువా!
నీదరిజేరితి — నిన్నుస్మరియించితి
నన్ను కరుణించి కాపాడవా ॥ యె ॥

I చిఱునవ్వులొలికించి దోగాడుచు — నన్ను
మురిపించు కొమరుండు కఱవాయెనే
పరితాపమున గుండె బరువాయెనే - నా
బ్రతుకంత చీకట్ల పాలాయెనే ॥ యె ॥

II లోకాలనాడించు పరమేశ్వరా — ఒక్క
పాపాయి నిమ్మంచు బ్రతిమాలితి
నీపాద పద్మాలనే నమ్మితి - నా
పాపాలు పరిమార్చి కాపాడవా ॥ యె ॥

మనో:— స్వామీ! యెహోవా దేవా!

ప్రకృతి విచిత్ర చిత్రములపై పరమార్థ కళావిలాసముల్
ప్రకటనజేసి; తన్మహిమ భక్తవరుల్ నుతిజేయుచుండ; నీ
సకల చరాచరంబుల ప్రశాంతిగనేలు యెహోవదేవ! నీ
యకలుష పాదపద్మముల నాత్మదలంతు నభీష్టసిద్ధికిన్;

ఆపద్బాంధవా! మా యిశ్రాయేలీయులు ఫిలిస్తీయుల నిరంకుశ పాలనమున ప్రాణములఱచేతబెట్టుకొని బానిస వృత్తితో బ్రతుకవలసినదేనా? మాజాతికక విమోచనయేలేదా! తండ్రీ! నీవు సంకల్పించు కొనవలయునేగాని నీకసాధ్యమేమున్నది?

లోకరక్షకా ! సంతానహీనురాలనై ప్రార్థించు నన్ను కనికరింపవా ! ఇశ్రాయేలీయుల దాస్యవిముక్తుల జేయగల సకల బలసంపన్నుడగు ఒక్క మగ బిడ్డను ప్రసాదించి తామరలున్న కొలనువలె నాబ్రతుకు ధన్యమొనర్చుము తండ్రీ ! ధన్యమొనర్చుము.

* నాభర్త రూపమునకు ప్రతిరూప మౌ
సుకుమారు కనులార జూచు టెపుడొ !
ఉయ్యాలపాన్పుపై నాకొట్టు పసివాని
పల్కరించుచు జోల పాడు టెపుడొ !
కడువేగిరమున మోకాళ్ళపై దోగాడు
తనయుని శిరము ముద్దాడు టెపుడొ !
ముసి ముసి నవ్వుల మురిపించు పుత్రుని
పాల బుగ్గలు గిల్లు భాగ్యమెపుడొ !

తరుణప్రాయము దిగజారి తరలిపోయె
అక్కటా ! ఆడజన్మ ధన్యత వహించు
బిడ్డలనుగాంచనేరని గొడ్డురాల
నేమిసేయుదు నీబాధ నెట్లు సైతు ;

ఓ దయామయా ! "అపుత్రస్యగతిర్నాస్తి" యన్నట్లు పుత్రహీనులకు గతులు లేక పోవుటయే గాక, లోక సుఖములుగూడ దూరమగునుగదా !

దేవదూత — ప్రవేశము.

**దేవదూత:—** ధన్యురాలా ! నీకు శుభమగుగాక ! నేను దేవదూతను; నీకన్నీటి ప్రార్థన విని యెహోవా దేవుడు నిన్నుకటాక్షించినాడు. అచిరకాలముననే నీవు-ప్రభాకరునిగన్న ప్రాక్సతివలె సింహబల సంపన్నుండును ఇశ్రాయేలీయ దాస్య విమోచకుడునగు పుత్రరత్నమును గాంచగలవు; నేటినుండి ప్రసవించుదనుక నియమబద్ధవై యుండవలెను.

కోరికగల్గినన్ గుడువగూడదు నీచపదార్థముల్; సదా
చార విశుద్ధవర్తన విసర్జనజేసి మెలంగరాదు; ద్రా
క్షారసమేని, కైపునిడుసారములేని గ్రహింపరాదు; నీ
యోరిమిజూపుచున్ ప్రసవమొందెడిదాక, సతీ మనోరమా !

మనో:- సర్వేశ్వరా! నేటికి నాపై జాలికలిగినదా!

దేవ:- మనోరమా! దైవసందేశము నాలకింపుము

* వినయవతి! నీకు సుతుడు పుట్టినది మొదలు
నైజముగనున్న యతని శిరోజములను
క్షురికచేనెప్పుడైనను గొరిగినయెడ
బలము సాంతంబు కోల్పోయి పతితుడగును;

కావున దైవాజ్ఞపాటించి నీకుమారుని తలపై మంగలి కత్తి పెట్టక జాగ్రత్తగా నుండవలెను.

మనో:- ఆహా! నేడుగదా! నాహృదయము భారము తీరిపోయినది.

(దూత నిష్క్రమించును)

(మనోరమ భర్త మానోహ ప్రవేశించును.)

మానోహ:- ప్రేయసీ! నిరంతర సంతాన చింతాభరవ్యగ్ర మనస్కవై పరధ్యానముగానుండు నీవు నేడిట్లు సంతోషితాంతరంగవై యుండ నాకే ఆశ్చర్యమగుచున్నది;

దిశలు నిండారిన యెహోవ దివ్యమహిమ
నేడు నీలోప్రవేశించి నిలిచె నేమొ!
కాకపోయిన నీముఖకాంతులిట్లు
పరిఢవిల్ల కతంబేమి? పంకజాక్షి!

మనో:- నాథా! మనము ధన్యులము - చిరకాల నిరీక్షితమైన మన వాంఛ ఫలించినది; గడియక్రిందట నేను యెహోవా దేవుని ప్రార్థించుచుండ

బాలసూర్యుని కాంతిని పరిహసించు
తేజమున నాయెదుట నిల్చి దేవదూత
మీకు సత్పుత్రుడొకడు జన్మించుననుచు
విశదముగజెప్పి యిప్పుడే వెడలిపోయె!

మానో:- దేవదూత సమాగమమున మన గృహము పావనమైనది; మన జన్మ ధన్యమైనది. అంధకార బంధురమగు మన జీవితాకాశమున ఆశాజ్యోతి వెలిగించిన పరమేశ్వరుడెంత దయామయుడు, ప్రేయసీ! దేవదూత ఇంకేమియు మాటలాడలేదా !

మనో:- మాటలాడకేమి? పుత్రోదయ పర్యంతము అపవిత్ర పదార్థముల నంటరాదనియు, ద్రాక్షాసవాది పానీయముల త్రాగరాదనియు బిడ్డ తల వెంట్రుకలను తీయరాదనియు త్రివిధ నియమములను తెలియ జేసెను;

మానో:- త్రిలోకపూజితుండును త్రితత్వసమాన్వితుండును అయిన పరమేశ్వరుని త్రివిధనియమములు ఆచరణీయములేగదా ! నీవికచనుము. దేవునకు కానుకల సిద్ధపరచుము; నేనిప్పుడే కృతజ్ఞతాస్తుతి చెల్లించి వచ్చెద.

(మనోరమ నిష్క్రమించును)

—: కీర్తన :—

యెహోవా! విశ్వవిలాసా! వేదాంతలోక నివాసా!
పాపాంధకారహరణా! భక్తపాలనా! దేవా భక్తపాలనా ॥యె॥

I పుత్రభిక్షకోరి నిన్నే పూజజేసితి
పుణ్యదూత మాటవినినే - పొంగిపోతిని !! దేవా! పొంగిపోతిని ॥యె॥

II పరిమళంబులేని విరినై - పరితపించితి
వరములంది సంతసించి - పరవశించితి !దేవా! పరవశించితి ॥యె॥

III దిక్కులేనివారిబ్రోచే - దీనబాంధవా!
దివ్యమహిమ లెవ్వరైనా - తెలిసికొందురే! దేవా! తెలిసికొందురే ॥యె॥

సర్వేశ్వరా ! నీమహిమా విలాసములు మానవులు గ్రహింపలేరుగదా !

గడియలో వాడిపోయెడి పూవులకు సైతం
మతి విచిత్రపు రంగులద్దువాడ !

సరసంబుగా తల్లి చనుమఱుంగున తిండి
పసికూనలకు సిద్ధపరచువాడ !
చావు పుట్టువులకు సంకెళ్ళు తగిలించి
జీవకోటిని సృష్టిజేయువాడ !
పాపపుణ్యావిశేష ఫలముల తులదూచి
ఇహపరంబుల తీర్పునిచ్చువాడ !

కాలమానంబు సర్వలోకాలెఱుంగ
దినకర సుధాకరులనింగి ద్రిప్పువాడ !
ఆశ్రయించితి నీచరణాంబుజముల
కావవే ! భక్తమందార !! దేవ దేవ !!!

(అవనిక జారును.)



# ప్రథమాంకము

## మూడవరంగము

( మనోరమ మానోహల గృహము )

మానోహ:— ప్రాణేశ్వరీ ! పెరిగి పెద్దవాడగుచున్నకొలది మన సాంసను మిక్కిలి పొగరుబోతగుచున్నాడు. కానక గన్నసంతానమని గారాబముతో బెంచితిమి. " తండ్రి శిక్షింపని కుమారుడు బుద్ధిహీనుడగు " ననుట మన యెడల నిక్కువమైనది ;

మనో:— కాదని యెవరనగలరు ! నిత్యము వానివలన వచ్చు కలహములచే నా మనస్సెంతో బాధపడుచున్నది ; ప్రజాసేవకుడగు సత్యవాదియు అనేకపర్యాయములు సాంసనునకు హితము నుపదేశించెను. కాని ప్రయోజనమేమున్నది.

(సత్యవాది ప్రవేశించును.)

మానోహ<br>మనోరమ } (సత్యవాదిని జూచి) పూజనీయులకు నమస్కారములు

సత్యవాది:— శుభమస్తు

మానో:— సత్యవాదీ ! ఈ పీఠము నలంకరింపుడు. మీరు చాలాకాలమునుండి కనబడనందున ఏ ప్రమాదము గలిగినదోయని ఆందోళన పడుచుంటిమి ;

సత్యు:— మీరూహించినది సత్యమే ! ప్రభుత్వము నాపై లేనిపోని నేరమారోపించి చెఱసాలలో బంధించి నిన్ననే విడుదలచేసిరి. చిరంజీవి సాంసను ఎక్కడ ?

మనో:— ఇప్పుడే ఇల్లు విడిచి పోయినాడు ; ఎవరితో నేతగవు గొనితెచ్చునో!

మానోహ:— వాడు మరలివచ్చువఱకు మాగుండెలు దడదడ కొట్టుకొనుచుండును. ఎప్పుడు చూచిన ఆటల పోటీలని సాము గరిడీలని సకాలమున కిల్లు చేరడు.

మనో:— అడుగో ! మన చిరంజీవి వచ్చుచున్నాడు.

(బాల సాంసను ప్రవేశించును)

సాంస:— జననీ జనకులారా ! నమస్కారములు
గురుదేవా ! వందనములు.

సత్యా:— అభీష్ట సిద్ధిరస్తు

మనో:— నాయనా ! కులవర్ధనుండగు కుమారుడవగుదువని కొండంత యాశ పెట్టుకొన్న మమ్మేల నిరుత్సాహుల జేసెదవు; నిన్నుగూర్చిన నిందాభియోగములు వినరాక వినుగెత్తు చున్నది. కుమారా!

హాయిగ వేడుమయ్య పరమాత్మను, దుష్కృతమెన్నడేనియున్
చేయకుమయ్య; సజ్జనుల స్నేహము వీడకుమయ్య; ఇశ్రయే
లీయ మనోరథంబులు ఫలింపగ న్యాయ గుణంబుతో ఫిలి
స్తీయుల సర్వగర్వమునశింప బ్రవర్తిలుమయ్య ! పుత్రకా !

మనో:— కుమారా! పార్వణ చంద్రోదయమువలె నీజన్మ కడు ప్రకాశితమైనది. దైవకృపవలన నీవు మాకు జనించితివి. నీవు కడుపునబడకమునుపే దేవదూత సాక్షాత్కరించి దైవసందేశమును వినిపించినది. ఆ సందేశానుసారముగ నీవొక నియమమును పాటింపవలయును.

పరమవిరోధివర్గములు పైబడి నిన్నెదిరింపవచ్చినన్
తలగదొకింత నీబలము దైవవరంబిది; నీ శిరోజముల్
గొరిగినయంతనే బలము గోల్పడి దీనతనుందు; వెన్నడున్
మరువకు నాహితోక్తుల కుమార ! పరాక్రమ సద్గుణాకరా !

సత్యా:— నాయనా ! వింటివిగదా ! నీతల్లిదండ్రుల హితోక్తులు - ఎన్నడైనను నీవు క్షౌరము చేయించుకొనరాదు, నీకున్నబలమును ప్రహాక్షుమును నకు వినియోగింపుము.

* తల్లిదండ్రులమాటలు దాటకయ్య!
నీచకార్యాల నెపుడు మన్నించకయ్య!

మహిమగల దైవనామంబు మఱవకయ్యా!
ప్రభుని ప్రార్థించుకొనుమయ్యా! భద్రమయ్యా !

సాంస:— పూజ్యులారా !

* శ్రేయమొదవించు మీశుభాశీస్సులంది
జాతిని సముద్ధరింప నాశక్తికొలది
పాటుబడి బానిసత్వంబు బాపుకొనెద
దైవ నిర్దేశమును శిరసావహించి ;

సత్య:— మ్మానోహ ! నాకికసెలవు దయచేయుడు ; తిమ్నాతు పురవాసులు నాకొఱకెదురు చూచుచుందురు.

మానో:— సత్యవాదీ ! నీకు సమయము దొరికినపుడు వచ్చి మమ్ము సంతోష పెట్టుచుండుము.

సత్య:— అట్లేయగుగాక ! (నిష్క్రమించును)

మనో:— నాథా ! దైవపూజకు వేళయైనది. మనమిక లోని కేగుదము కుమారా ! రమ్ము;

సాంస:— అమ్మా ! నేనిప్పుడే పూదోటకేగి పూజకై పుష్పముల గొనితెచ్చెద;

మానో:— నాయనా ! శరవేగమున బోయిరమ్ము. ప్రేయసీ ! పోవుదముపద;

(సాంసను ఒకవైపునను, తల్లిదండ్రులు మఱొకవైపునను లోనికేగుదురు - తెరబడును)

సాంసను:— (ప్రవేశించి) ఓహో ! నేను దేవుని వరమున నా స్వజాతీయుల దాస్యము దొలగింప ప్రట్టితినట.

* అసయము దైవభక్తి సముచింతులై చలిచీమకేని హా
హానిని తలపెట్టనేరని పునీతమనస్కుల నాస్వకీయులన్
కనికరమింతలేక కడగండ్లనుబెట్టిన నీచులార ! మీ
తనువులు జీల్చుకాలమిదె దాపురమై చనుదెంచె నేటికిన్;

అదిగో ! ఫిలిస్తీయులిటు వచ్చుచున్నారు. వారిని నిర్జించి నాకోపమును చల్లార్చుకొనియెద ! (దూరమునుండి వచ్చువారినిచూచి) దుష్టులారా! రండి ! రండి ! మీకండలను జీల్చి కాకులకు వైచెద;

* పరమ దుర్మార్గులార ! మీపాప ఫలము
పండినందున నాబారి బడితిరిపుడు
పశులబాధించు మీరక్తపాతమందు
మునిగితేలెద మాజాతి ముక్తినొంద !

( ఇద్దరు పౌరులు ప్రవేశింతురు )

1 పౌరు:— సాంసన్ బాబూ ! ఎందుకయ్యా అంతబిగ్గరగా కేకలేస్తున్నావు 'మేము ఫిలిస్తీయులము కాము' ఇశ్రాయేలీయులమే !

సాంస:— మిత్రులారా ! మన్నించండి, మిరె ఫిలిస్తీయులని దూషించితిని బాధపడకుడు.

2 పౌరు:— మేమొకవేళ ఫిలిస్తీయులమైనచో ...

సాంస:— తప్పక చంపియుందును.

1 పౌరు:— మనల్నిపాలించే ఫిలిస్తీయులపై తిరుగుబాటుచేసినచో ముప్పు రాదటయ్యా !

సాంస:— పిఱికివారలారా ! ఫిలిస్తీయులు మనలను పాలించుటెంత అవమానము. బానిసత్వమున జీవించుటకన్న ప్రాణముల విడచుటయే మిన్న; ఇప్పటికైనను కండ్లుతెఱచి భిన్నత్వముల విడచి దైవమును దలచి స్వాతంత్ర్య సమరమునకు సిద్ధముకండు; నేను పుష్పవనికేగి పూజాసుమంబుల గ్రహించి మాతల్లిదండ్రులకిచ్చి వచ్చెద:

(సాంసను నిష్క్రమించును)

2 పౌరు:— ఇంతలోనే మన సాంసనెంతవాడయ్యాడురా !

1 పౌరు:— కాకేమిరా! దేవునివరాన పుట్టినవాడురా! బానిసత్వము నెందుకొప్పుకొనును.

2 సైను:- నిజమేరా ! తల్లిదండ్రులు పిఱికి మందు పోయుచున్నను ఫిలిస్తీయుల పీచమడగించుటకు పరుగులెత్తుచున్నాడు

1 సైను:- సాంసను ఫిలిస్తీయుల అంతముచూడనిదే నిద్రపోయేటట్లులేదురా! ఇశ్రాయేలీయులకు నాయకత్వమువహించి నడిపించగలడురా !

2 సైను:- ఔనురా ! సాంసనులో అంతులేని బలమున్నది. మనముపోయి మన స్వజాతీయులను కూడగట్టి సాంసను ననుసరింతము రమ్ము.

(నిష్క్రమింతురు)



# ద్వితీయాంకము

## మొదటిరంగము

(తిమ్నాతుపట్టణ సమీపమునగల ఉద్యానవనమున సాంసను ప్రవేశించి తిమ్నాతుపట్టణమువైపు జూచుచు)

సాంసను:—

* అదె ! తిమ్నాతుపురంబు; తత్పుర సువర్ణాక్రాంత దేవాలయం
బదిగో ! అల్లదె రత్నరంజిత పతాకాసీక సంచాలనం
బదె సర్దారుల మందిరం; బదియె న్యాయస్థాన; మత్యద్భుతం
బొదవించెన్; తరుషండమండిత సుగంధోద్భూత విఖ్యాతమై !

నేనిపుడు తిమ్నాతుపట్టణమును సమీపించితిని: ఆహా! చిగురుటాకు చేతులతో చేరబిలుచుచున్న ఈ వనదేవత యెంత రమణీయముగానున్నది. గమనాయాసము తగ్గిపోవ కొంతవడి విశ్రమించి తరువాత పట్టణమున ప్రవేశించెదగాక!

(సరోజ ప్రవేశము.)

—: కీర్తన :—

సరోజ:—

కమ్మనిపూల - రెమ్మలమీద - తుమ్మెద చేరుకొన్నది -
అదే! అదే! ఝుమ్మని పాడుచున్నది.

I మల్లెతీవెలవిగో గున్న - మావినల్లుకొన్నవి
కోకిలమ్మ ప్రియునిజూచి - కూహూయనుచున్నది
చిఱుగాలికి పరిమళించి వి[illegible]బాలికలూగె ॥కమ్మ॥

II నీలిమబ్బులవిగొ కౌగి-లించుకొనుచున్నవి
గాలివాహనాలమీద-తేలిపోవుచున్నవి
వలపునిండి ఒడలంతయు - పులకరింపసాగె ॥కమ్మ॥

III చెంగునదూకే యౌవన - జీవిత మాధుర్యము
పొంగి పొరలు సౌందర్యము - తొంగిచూచెనాలో
ఉరకలెత్తి నామనసే - పరవశించిపోయే ॥కమ్మ॥

( రంగస్థలముపై పడగవిప్పిన పాము కన్పించును )

సరోజ:— అమ్మయ్యో! విషసర్పము, రక్షింపుడు ; రక్షింపుడు.

సాంస:- ఎక్కడిదీ యార్తధ్వని, స్త్రీ జనాలాపమువలెనున్నది.

సరోజ:— అయ్యయ్యో కాపాడువారులేరా ?

( వెనుకకు నడుచుచు సాంసనును తగులును )

సాంస:— (సంభ్రమముతో సర్పమును చంపి) బాలామణీ! విషజంతువులను ప్రాణముతో విడువరాదని ఈ సర్పమును సంహరించితిని.

సరోజ:— అబ్బా! యిప్పటికి నాప్రాణములు కుదుటబడినవి. ఈ పామును చూచి గుండె దడదడలాడ వణకిపోయితిని.

సాంస:— లావణ్యవతీ! ( పామును జూపుచు ) ఇది భయంకరమైన విష జంతువే! తొల్లి సైతానుడీ సర్పరూపమున దేవమానవుల మైత్రిని తెగతెంపులుజేసి సర్వేశ్వరుని శాపమున భూమిపై పొట్టతో ప్రాకులాడ వలసివచ్చినది. ఈ సర్పజాతి సామాన్యమైనదిగాదు;

* ఈసర్పమేగదా! లూసీఫరను పేర
ప్రభువును విడి అధఃపతనమయ్యె;
ఈ సర్పమేగదా! ఏదేను వనములో
మొదటి దంపతులను మోసగించె;
ఈ సర్పమేగదా! ఈశ్వర సృష్టిలో
కనుపించు దుర్నీతి కలుగజేసె;
ఈ సర్పమేగదా! ఇహపరంబులనేలు
పరమాత్మ నెదురించి పంతగించె;

ఈ మహాసర్పమున తొల్త నిమిడియున్న
దురితు నపవాది నగ్నిలో ద్రోయనెంచి;
నరకమును సృజించినయట్టి పరమతండ్రి
ఆజ్ఞలేనిదె! చీమైన నంటగలదె!

సరో:- దయామయా! ప్రాణదానముజేసిన మీకు - కన్యనగు నేనేమిచ్చి ఋణ విముక్తనుకాగలను.

సాంస:- (తనలో) ఓహెూ! కన్యయట; అందుచే నీయువతిని పరిగ్రహించుటలో తప్పేమిగలదు; (ప్రకాశముగ) మోహనాంగీ! ఋణవిముక్తి పొందుటకు నీకవకాశమున్నదిగదా!

సరో:- ఎట్లు

సాంస:- ప్రతిఫలమిచ్చుట వలన

సరో:- ఏమిటా ప్రతిఫలము

సాంస:- శిరీష కుసుమ పేశలమగు నీ శరీరమే

సరో:- ఒంటరిగానున్న స్త్రీలతో పురుషులిట్లు మాటలాడుట ఉచితమా?

సాంస:- జంటగా నుండుట ఉచితమని యేనిట్లు మాటలాడితిని. లతయును, లతాంగియును, కవిత్వమును పరుల ఆశ్రయములేనిదే ప్రకాశింపనేరవు. మొదట నీవు కన్యవని చెప్పినతోడనే నామనసు సంచలించినది. నాయూహలకు రెక్కలు మొలిచినవి; లతాంగీ!

* ఎవ్వరిదానవే కువలయేక్షణ? ఒంటరివై భయంబు లే
కివ్వన భూమినుండ గతమేమి? భవత్పరి రంభణంబు చే
నెవ్వనిధన్యుజేయ మదినెంచితివే? నవమోహనాంగి! నీ
జవ్వన పుష్పమెవ్వని వశంబొనరింతువొ? తెల్పవే చెలీ!

ఓ విలాసవతీ! నీజన్మచే పవిత్రమైన స్థలమేది? నీపేరువలన వన్నెకెక్కిన సువర్ణాక్షరములెవ్వి? నీ వృత్తాంతము వినకుతూహలపడుచున్న నాకెఱిగింపగూడదా!

సరో:- ఏకాంతముగనున్న యేకాంతను జూచినను మీమగవారిట్లే చొరవ జేసికొని సంభాషింతురుగదా!

నిగమార్థంబులునేర్వనీ! కళలలో నిష్ణాతుల్లైయుండనీ!
జగముల్ సర్వముగెల్వనీ! అమరసాహిత్యంబు సాధింపనీ!
చిగురుంగైదువువంటి జవ్వని తటస్థింపంగ రాగిల్లి మీ
మగవారల్ కడుచంచలాత్ములయి ధీమత్వంబు గోల్పోవరే!

సాంస:— (నవ్వి) ఔనౌను ! మీ ఆడవారేనా అంత బుద్ధిమంతులు

* హృదయమునకు నచ్చిన వరుండెదురు పడిన
కనులతో బల్కరించి చక్కగ నటించి
వలపులూరించి ఒయ్యార మొలకబోసి
ఆటలాడించువారు మీ యాడవారు;

సరో:— (తనలో) శరీర దార్ఢ్యమునకు తోడు లౌకిక పరిజ్ఞానము నాచికొన్న జగన్మోహనుడగు నితనిని చూచినది మొదలు నామనస్సు వీనికి వశమై పోవుచున్నది. (ప్రకాశముగ) మంచి సరసుడవే! కాని పండువంటి నీశరీరము ప్రయాణాయాసమున వాడిపోయినది- ఇచ్చోట కొంత విశ్రాంతి గైకొనుడు.

సాంస:— కోమలీ! నీమాటలు సుధారసపూరితములై నాహృదయతాపమును నివారించినవి. కానీ! నీయూరిపేరులు తెల్పక నన్మూరింపదగునా!

సరోజ:— మాటల సందర్భమున మఱచిపోతిని; నేనవివాహితను; తిమ్నాతు పురవాసిని; ఫిలిష్తీయుల బిడ్డను. నాపేరు సరోజ!

సాంస:— (ఆలోచించుచుండును)

సరో:— ఏదియో! ఆలోచించుచున్నారు.

సాంస:— ఆ...ఆలోచింపవలసిన అవసరమేర్పడినది. చెలీ! నేనును అవివాహితుడనే! కానీ ఇశ్రాయేలీయుడను నాపేరు సాంసను.

సరో:— అయ్యో! ఇశ్రాయేలీయులు మాకు శత్రుసమానులు.

సాంస:— అట్లయిన మన దాంపత్యము పొసగనేరదా! పవిత్రప్రేమకు ప్రతిబంధకములుండునా! సఖీ! అటుచూడుము.

* చేతమామిడిగున్న సంప్రీతినొంద
మాధవీలత కుసుమ సంపత్తి తోడ
నల్లుకొనియుండె ననురాగ మతిశయింప
తలచప్రేమకు జాతిభేదంబు గలదె!

సరో:— మీరు చెప్పినదిసత్యమే ! అయినను నేను స్వతంత్రురాలను కాను. తండ్రిచాటు బిడ్డను. మా తండ్రి మన వివాహమున కంగీకరింప వలయునుగదా!

సాంస:— అంగీకరించునట్లు నీవు ప్రవర్తించవలయునుగదా!

సరో:— ఎట్లు ప్రవర్తింపవలయును?

సాంస:— అది నేనుపదేశింపవలెనా! ఆడదానిమాటవిని అది పురుషుడాదామం తటివాడేమయ్యెను. నీప్రయత్నముపై ఫలిత మాధారపడియున్నది.

సరో:— మనోహరా! నాశక్తికొలది ప్రయత్నించెద. నేను వచ్చి చాలాతడవైనది. మాతండ్రి నాకొఱకు చూచుచుండును. నాకిక సెలవు దయచేయుడు.

(సరోజ నిష్క్రమించును - అవనిక జారును)

(సరోజ శయన మందిరము )

సరో:— కట కటా ! నేనెంత దురదృష్టవంతురాలను నా తల్లియే జీవించి యున్నచో నాకింతవఱకును వివాహము జరుగకుండునా! ‘ ఎద్దంత తండ్రికన్న ఏనుఁలబుట్టంత తల్లిమేలని ’ పెద్దలన్నది సత్యమేగదా? మాయమ్మ మరణముతో మనోవ్యాకులుడైన నా జనకుడు నాకు తగిన వరుని సమకూర్పలేక పోయెను.

పాము కోఱలనుండి కాపాడిన పరాక్రమశాలియు సద్గుణ సంపన్నుడు నగు సాంసనును భర్తగా పొందగల ననుకొంటినిగావి “తానొకటితలచిన దైవ మొకటి తలచు” నన్నట్లు పూర్వవైరములను పురస్కరించుకొని మాజనకుడీ సంబంధమున కంగీకరించునా !

చక్కనివాడటంచు మనసార వరించినవాని జేరగా
నక్కట వంశవిప్లవము లడ్డగనిల్చెను; సాహసించి నా
మక్కువ తీర్చుకోదగిన నూర్గమొకింతయు దోచదాయె; నీ
చిక్కుసమస్యలోబడి కృషించి నశించుటయే! శరణ్యమా !

పోనీ నాప్రియుడు ఫిలిస్తీయుడై జన్మింపగూడదా? ఇశ్రాయేలీయుడగు సాంసనునకు నామనస్సేలవశమైనది? విరోధి వంశీయుని వివాహమాడ నాతండ్రి సమ్మతించునా? ఒకవేళ సమ్మతించినను ఉభయ వంశములైకమత్యమున నుండగలవా? ప్రాణదానముచేసిన సాంసనునందు లగ్నమైన నాహృదయమెట్లు మరల్చుకొందును. నాటి సన్నివేశము ప్రతిదినము నాహృదయ ఫలకమున మెఱయుచున్నది. అనుక్షణమా యువకుని స్మరింపజేయుచున్నది. విస్మరింప నాకు శక్యముగాకున్నది.

జగద్రక్షకా! నిరాశావృతమైన నాజీవితాకాశమున పండువెన్నెలకాంతి ప్రసరించినను భయంకర కాలాంబుదంబుల నుసికొల్పినను నీదే భారము.

* పరిమళంబెగజిమ్ము చిఱుగాలి నాశించి
 పూదోట జరియింప బోవనేల?
పోయిన ననుజూచి బుసలు గొట్టుచులేచి
 విషసర్పమొకటి కన్పించనేల?
కన్పించగానేను గావు కేకలువేయ
 నాడు సాంసోను కాపాడనేల?
కాపాడినను పెండ్లి గావించుకొనుటకు
 వంశవైరము లడ్డుపడగనేల?

తండ్రి కీవార్త నేనెట్లు ధైర్యమూని
తెలియజేయుదు; నొకవేళ తెలుపుకొన్న
సమ్మతించునె? తొలి విరోధమ్ము మఱచి
ఏమిచేయుదు? పరితాప మెట్లుదీరు?

( తిమ్నాతీయుని ప్రవేశము )

తిమ్నా:— (సరోజను సమీపించి) కుమారీ! సరోజా! ఎప్పుడు చూచినను ఏదో మనోవేదనతో నుండువెందుకమ్మా? నీతల్లియే జీవించియున్న నిన్ను గురించి నాకీ దిగులుండునా? నీకు నచ్చిన వరునిదెచ్చి వివాహము జేసిన నాభారము తీరిపోవునని సంబంధములకై కాళ్లరిగిపోవ తిరుగు లాడితిని కాని నీవయోరూపలావణ్యములకు తగిన వరుడు లభించడాయెను. ఇంకను ప్రయత్నించెదను విచారపడకమ్మా!

* తుమ్మెదవంటి ముంగురులు దువ్వవు; విచ్చిన పుష్పములన్ శిరో
గ్రమ్మున సంతరింపవు ; సకాలములో భుజియింప వస్త్రమున్
కమ్మని సాహితీ మధురగానము సేయవు; నీ మనమ్ములో
నుమ్మలికంబు దాచుకొని యూరక నవ్వితులేచ న్యాయమా !

అమ్మా! తల్లినైనను తండ్రినైనను నీకు నేనేగదా! నాకడ నీకీ దాపరిక మెందుకమ్మా! నీ మనోవేదన నేనెఱుంగదగనా !

సరో:— నాన్నా! నాకే మనోవేదనయు లేదు; సంతోషముగానున్నాను.

తిమ్నా:— అమ్మా! సంతోషహృదయము ముఖమునకు తేటనిచ్చునుగదా! చిఱు నవ్వు వెన్నెలలు చిందు నీ ముఖేందుబింబమున విషాదమేఘము లావరించినవి. కుమారీ ! నీవు చింతింప కారణమేదో మనసువిప్పి నాతో చెప్పుము ; నాచేతనైనంతవఱకు నీకు సంతోషము కలిగింతును. నీక్షేమమరయని నా జీవితమెందుకమ్మా!

సరో:— (భయముతో) నాన్నా ...

తిమ్నా:— భయపడక చెప్పు తల్లీ

సరో:— మన పురమునకు దక్షిణమునగల ఉద్యానవనమున నన్నొక యువ కుడు పాము గండమునుండి తప్పించెనని చెప్పియుంటినిగదా !

తిమ్నా — ఔనమ్మా! అనాడు నీవు చెప్పునపుడు నాకే భయము కలిగినది. సర్ప మును చూచి జడిసికొని నీవిక్లైతివా !

సరో:- లేదు నాన్నా! నాడు నన్ను రక్షించిన యువకునియందు నామనస్సు లగ్నమైనది. అతడు అవివాహితుడు ; నాకన్నివిధముల తగినవాడు

తిమ్నా:- మంచిదమ్మా! నేనన్వేషింపవలసిన వరుని నీవే కనుగొంటివి. ఇక నాభారము తీరినట్లే !

సరో:— జనకా! అతడు జోర్యా నివాసియగు ఇశ్రాయేలీయుడు పేరు 'సాంసను

తిమ్నా:— (ఆశ్చర్యముతో) ఆఁ... ఇశ్రాయేలీయుడా ! అతడు మన విరో

వర్గములోనివాడమ్మా! అతని సంబంధము మన కన్నివిధముల అనః కమగును. నీవును కొంచెమాలోచింపుము.

* ఎందఱులేరు నీవు వరియింప దలంచిన నీ స్వజాతిలో
సుందరు; లట్టివారలను జూడక శత్రుని పెండ్లియాడినన్
బందుగు లిచ్చగింతురె ! శుభంబగునే! అడియాస వీడుమా !
అందని మ్రానిపండ్ల కొఱకట్టులుసాచిన లాభముండునే !

సరో:– తండ్రీ ! నాకోర్కె నెన్నడేనియు కాదని యెఱుగవు; నేడు నా వివాహ విషయమున మీకెందుకీ పట్టుదల.

తిమ్నా:– పట్టుదల కాదమ్మా ! వివాహబంధమొకనాటితొ తీరిపోవునదికాదు. అందుచే దీర్ఘముగా నాలోచింప ఈ వివాహమువలన ఫిలిస్తీయుల కును ఇశ్రాయేలీయులకును ఎడతెగని విరోధము కలుగునని సందేహ ముగానున్నది. అదిగాక సర్దారులంగీకరింప వలయునుగదా!

సరో:– నానా ! ఈ వివాహమువలన ఉభయ వంశములు ఐకమత్యమున మెలగునని యేల తలంపరాదు? ఇక సర్దారులా! వారు మీకు చిరకాల పరిచితులు. వారికి చెప్పి ఒప్పించుటెంతపని?

తిమ్నా:– ఇది అసాధ్యమైన కార్యమమ్మా! ఇందు తలదూర్చి బాధపడుటకన్న ఈ వివాహము విరమించుకొనుటమేలని నా అభిప్రాయము.

సరో:– నాన్నా ! వివాహమునుండి కాదు. జీవితమునే విరమించుకొన నిశ్చ యించుకొందును. కని పెంచిన తండ్రియే నాకోర్కె కాదనినప్పుడు ఇక నామొఱాలించువారెవరు? ఆత్మవంచన నెట్లుచేసికొందును.

* చూపుకందిన సాంసను రూపురేఖ
హత్తుకొనె నాహృదయసీమ - నతనియందు
లలితమగు నామనస్సు సంలగ్నమయ్యె!
మరణమొందెద; నీపెండ్లి జరుగకున్న!

తిమ్నా:– (కన్నీరు తుడుచుచు) అమ్మా ! అమ్మా ! అట్లనకుము. నేను విన లేను; నేను జీవించియుండగనే నీవు మరణింతువా ! అట్లు జరుగు

టకు విలువలేదు తల్లీ ! నీపవిత్రప్రేమకు నేనేగాదు. సర్వప్రపంచము తలవంచక తప్పదమ్మా ! నీవు వేగిరపడక నిశ్చింతగానుండుము. నీ యిష్టానుసారముగా వివాహముజేయ ప్రయత్నింతును. కుమారీ ! నీవు లోనికేగుము. నేనివ్వుడేపోయి సర్దారులతో సంభాషించివచ్చెద.



# ద్వితీయాంకము

## రెండవ రంగము

మనోరమ, మానోహ, సాంసను లాసీనులై యుందురు.

మానోహ:- కుమారా! నీవు తిమ్నాతు పురికేగివచ్చినది మొదలు పరాధీన మనస్కుడవై కనబడుచున్నావు. మనసువిప్పి మాతో మాటలాడవు. నిన్నెవ రైన పరాభవించిరా? బాధించిరా?

సాంస:- జనకా! నన్నెవరు పరాభవించి బాధించగలరు.

మానో:- మఱి! నీవిట్లుండ కారణమేమి?

మనో:- నాయనా! వేళకారగింపవు; వినోదముల పాల్గొనవు. గ్రహణమునాటి చంద్రునివలె కళావిహీనుడవై కనబడుచున్నావు.

మానో:- కుమారా ! తల్లి దండ్రులకు చెప్పగూడని రహస్యమేమున్నది ! పిసినారి దాచిన ధనమువలె నీమనసులోని మాట బయటబెట్టవెందులకు? నిన్నుగుఱించి మేము నిత్యము దిగులుపడపలసినదేనా !

సాంస:- తల్లి దండ్రులారా ! మన్నింపుడు; తిమ్నాతు పట్టణోద్యానవనమున నొక్క ఫిలిస్తీయుల యువతి నాహృదయము నాకర్షించినది. నాటి నుండి నా మనసాకన్యయందు లగ్నమైనది. ఈవిషయమును మీతో చెప్పుటకు వెఱగందితిని;

మానో:- కుమారా ! ఫిలిస్తీయులతో సంబంధమా !

* క్రూరావేశపరీత దుష్టవిమతుల్ కోపస్వభావుల్ దురా
చారుల్ గారె ఫిలిస్తు వంశజులు; తత్సంబంధ బాంధవ్యపుం
దీరుల్ తెన్నులసహ్యముల్; పరమశాంతింగూర్చుకాంతామణుల్
లేరే! స్వీయగులాన పాణిగ్రహణాశ్లేషంబు నాశించినన్ ;

సాంస:- జననీ జనకులారా !

* గాన సాహిత్యములు రెండు కలిసినట్లు
పాలు నీరము లేకమై పరగినట్లు
అలరి మా మనోభావాలు మిళితమయ్యె!
అన్యకాంతలనేను, పెండ్లాడలేను;

మానో:– కుమారా ! ఇక నిశ్చయము మారదా ? అట్లులైన కన్యార్థము నేడే తిమ్నాతుపురమునకు బయలుదేరుదములెమ్ము.

(తెరపడును)

(మనోరమ, మానోహ, సాంసనులు ఒకవైపునుండి ప్రవేశింతురు)

సాంసః– తల్లిదండ్రులారా! ఈ మహారణ్యమును దాటినచో మనమా 'తిమ్నాతు పట్టణము' చేరగలము. నడచి నడచి మీరు బడలికచెందినట్లున్నారు. ఈ తరుచ్ఛాయను కొంచెము విశ్రమింపుడు. మీకొఱకు వన్యఫలముల సేకరించి తెచ్చెదను.

(ఒకవైపు కుపోయి సింహగర్జనము విని)

సాంసః– ఏమది ! భయంకర సింహగర్జనమే ! (చూచి) ఈ సింహము నోరు తెఱచికొని నాపై దుముకవచ్చుచున్నది. దీనిని చీల్చి చెండాడెదగాక.

(లోనికేగును - లోపల సింహముతో పోరాడినట్లు కలకలము)

సాంసః– (ఆయాసముతోవచ్చి) ఆహా ! దైవబలమున సింహరాజమును మేక పిల్లనువలె చీల్చి చంపితిని (తల్లి దండ్రులజూచి) జననీ జనకులారా! యీ ఫలములను భక్షింపుడు- తరువాత పయనము సాగింతము.



# ద్వితీయాంకము

ప్రథమ రంగము

( పాదితో మంగలి లింగన్న ప్రవేశించును )

మంగలి:— మంగలివాళ్ళమంటె ఈలుటి కలుసై పాయ్యాంగాని రాజ్యాం పాలించే రాజులకు, మాకు తప్ప, కత్తి చేతబట్టగల నిబ్బరం ఎవడి కుంది? పూర్వం మేము మారాజులతో సరితూగేవాళ్లం కాబట్టె మారాజు పెండ్లం మాలు మీద కూసుంటె మంగలోడి పెండ్లం డోలు మీద కూసుందనే సామెత కలిగింది. నిజంగా గొప్పతనమంటే మాదే! ఎంతగొప్పోడి తలైనా నాయొరమచేతి కిందికి రావల్సిందేగదా!

యెనక మారాజుకి మ తాత తలగొఱుగుతుంటె కత్తి పడి కాస్త సళ్లు బోయిందట, అప్పుడు మాతాత యేంజేశాడో తెలుసా? కటిక్కుమని రాజు తలపై కత్తి పిడితట్టి బిగించుకొన్నాడట. ఆ కత్తిపిడి పోటుతో ఎన్నాళ్ళనుంచో ఉన్న మారాజుగోరి పార్శపు తలనొప్పి తొలగిపోయిందట. ఆదెబ్బతో మాతాతకు పెద్ద పేరొచ్చింది. మా రాజుగోరు మాతాతకు, మెచ్చి పదెకరాల మాన్యం పారేశా డంట; దేశంలో పార్శపునొప్పి వాళ్ళంతా నేనెరిగిందాక మాయింటి ముందు చీమలబారులాగ తిరుగుతుండే వాళ్ళు.

ఆ పదెకరాలిప్పుడుందా! లేదు; మాయబ్బ హయాంలో కల్లమ్మ కనక దుర్గమ్మకు తాగుడుకింద జమకట్టేశాడు. లేకపోతే పాదిచేత బట్టేవాడినేనా! —

మీరాఖాన్:— (ప్రవేశించి) క్యారే! మంగలీ! ఇప్పుడు నీకి బొత్తిగా కన్పడ్డంలేదు.

మంగ:— ఎవరు? సాయబుగారా! నేనెందుకు కనబడను సాయబూ! రోజూ పదిండ్లు దిరిగి పది తలలు గొరక్కపోతే పొయిలో పిల్లి లేచేదెట్లా? పొద్దస్తమానం నీకు కనబడుతుంటే పొట్ట జరగొద్దూ!

మీరా:— (నవ్వి) పొట్ట పెరగవచ్చు. నైతొ తరగవచ్చు గాని పొట్ట జరగడం నేనెక్డా చూడలేదుభాయ్;

మం:— నిజమే! పొట్ట జరగడమంటె నీకేం తెలుసు సాయబూ! మా రాజు

మంచపుకోటి నల్లిలాగ రాజదర్బారులో నిల్చుండి షిత్తం షిత్తమంటూ మొత్తాల్ మొత్తాల్ జేబులేసుకొంటావ్ - పైగా అంగిలిలేని జంతువు లాగా అమాంతంగా లంచాలు మింగేస్తుంటావు నీకేంకొదవ?

మీరా:- క్యారే! నేను లంచం తింటున్నానా! పరువుగల్లవాళ్ళకు పనిచేసి పెడితే నాకు బహుమానం హిస్తారోయ్ బహుమానం!

మంగ:- బహుమానంకాదు సాయబూ! అది పచ్చిగడ్డితో సమానం అను. ఛర్వాలెదులే తిను. ప్రభుత్వమే పట్టించుకోనప్పుడు నిన్నని, యేం ప్రయోజనం ?

మీరా:- నిన్న నీకోసం వచ్చాన్భాయ్; ఇంట్లో మీయాడదాన్కడిగాను, నీవు లేవని చెప్పి వెంటనే తల్పుమూసేసింది;

మంగ:- నేను లేనప్పుడు మాయాడది తలుపు తెఱవదులే సాయబూ!

మీరా:- అయితే! నీవు యెప్డు వచ్చావ్ ?

మంగ:- ఇది యెండాకాలంకదూ! ఎక్కడజూచినా పెండ్లిండ్లే! గొప్ప వాయిద్దె కాడినని కోలు కొట్టడానికి కందఱూ నన్నే కబురుజేస్తుంటారు. సాంసను సరోజమ్మల పెండ్లికి బెంబాండంగా డోలుకొట్టి యీపూటే ఇంటి కొచ్చాను.

మీరా:- వారెవ్వా! పెండ్లిభోజనం దిట్టంగా తగిలిందన్నమాట;

మంగ:- అబ్బబ్బా! యేమిభోజనం! యెత్తిన చేట దించకుండా పెట్టేరు. నాజనమలో అటువంటి లడ్లు, గారెలు, అరిసెలు, అప్పడాలు తినలే దంటే, నమ్మ.

మీరా:- (చప్పరిస్తూ) పెండ్లి భోజనాల్కి తమ్మని సర్దారుల్కి గూడా సాంసను కబురుచేసినాడు భాయ్; సర్దార్లు అక్కడిక్కి పోవాలని తయ్యారై దాడీ గొరిగించుకోడాన్కి నిన్ను తచ్చనం తీస్కరమ్మని నన్ను పంపినార్ భాయ్!

మంగ:— అట్లయితే ! సర్దారులతో నీవుగూడ పోయినప్పుడు నేను చెప్పింది నిజమో ! అబద్ధమో ! తేల్చుకో ! నన్ను సర్దారు అప్పుడే రమ్మన్నారా !

మీరా:— నాయెన్క జెట్టి తీస్కరమ్మన్నారు భాయ్

మంగ:— కడుపు బిర్రుగావుంది గర్రున తేపులొస్తున్నయి, సర్దారులా ! నిలబడి క్షౌరం చేయించుకోలేరు. నేనా కూసుండి గొరగలేను. ఏంజెయ్యనబ్బా ! పెద్దసిక్కే వచ్చింది.

మీరా:— అరేభాయ్ ! భీతిపడ్కు. నీకి పొక్కడ్నుంచి పక్కడ్కి నడిచేటప్పటికి కడ్పుకొంత సర్దుకోదూ ! లేలే పోదాం !

మంగ:— రాజోరి ఆజ్ఞ ! పోకతప్పుతుందా ! పద.

(అందరు నిష్క్రమింతురు)

(సాంసను తల్లి దండ్రులతో తిమ్నాతునుండి జూర్యాకు ప్రయాణముచేయును)

మానో:— కుమారా ! మీయమ్మ నడువలేక ఆయాసపడుచున్నది. ఈవనమున కొంత విశ్రాంతిగొని ప్రయాణించుట మంచిది.

మనో:— నాయనా ! మీనాయనగూడ అలసిపోయినట్లున్నాడు.

సాంస:— జననీ జనకులారా ! మీరిందు విశ్రమింపుడు. నేనటుబోయి మీకేదైన ఆహారమును గొనివచ్చెదను. ( అటువైపు తిరిగి కొంచెమునడచి ) ఓహో ! నాచే చంపబడిన మృగరాజు కళేబరమదియే ! చూచి వచ్చెదగాక ! (తెరలోనికిబోయి ఆకు దొన్నెతో తేనెనింపుకొని) నేను సంహరించిన సింహ కళేబరమునందెంత తేనె తెట్టె యేర్పడినది తేనె తెట్టెనుండివచ్చిన ఈతేనె ఎంత మధురముగా నున్నది. నామాతా పితలకే తేనెనిచ్చి సంతృప్తి పరచెదగాక (తల్లి దండ్రులను సమీపించి)

సాంస:— తల్లిదండ్రులారా ! అమృతముకన్న మధురమైన యీ తేనియ నారగింపుడు.

( తల్లి దండ్రులకు తేనెనిచ్చును వారు త్రాగుదురు )

మానో:— కుమారా !

* ఎక్కడనుండి తెచ్చితివో ! యిక్షురసంబును కండ చక్కెరన్
తక్కువ చేయజాలిన సుధామధురాధికమై తనర్చు నీ
చక్కని తేనెధారలు ; గ్రసించినవెంట బ్రయాసమంత యే
దిక్కుల బారిపోయెనో? మదిన్గడు హాయి జనించె పుత్రకా !

సొంసః— జనకా ! ఆకనుపించు ఊడల మఱ్ఱికి ఉత్తరమున నీమధువు లభించినది. లెండిక బయలుదేరుదము.

(నిష్క్రమింతురు)



# తృతీయాంకము

## మొదటి రంగము

(సాంసను, సర్దారులు, అతనుతైయుందురు)

సాంస:— బంధుమిత్రులారా !

* పిలిచినయంత జాతి మత భేదములెంచక పెండ్లి భోజనం
బుల కరుదెంచి మాహృదయముల్ పరితృప్తిని చేర్చియున్న మీ
యలఘు విశాలభావముల కంజలిమోడ్చెద మిత్రులార ! నా
పలుకు వినోదప్రశ్నల కుపాయముతోడ జవాబు చెప్పుడీ !

1 సర్దా:- మీ వినోద ప్రశ్నలకు మేము జవాబు చెప్పవలెనా !

మీరా:— అచ్చు. అచ్చు. దిట్టంగా తిన్నాం ఇకేం పనుంది. కానియ్యండి.

2 సర్దా:— అటులైన మేము మొదట ప్రశ్నింతుము. మాకథను విప్పిన తరువాత మీ కథ వేయుము.

సాంస:— ఎట్టులైనను నాకభ్యంతరములేదు.

1 సర్దా:— సరె ! ఇదిగో కథవేయుచున్నాను.

* కన్నుమూయక నిదురించు చున్నదేది?
యోనిజంబయ్యు ప్రాణంబు లేనిదేది?
సాగిపోవక తిరిగెడి చక్రమేది?
విప్పిచెప్పుము సాంసను విబుధవర్య !

సాంస:— కన్నుమూయక నిదురించునదేది? (ఆలోచించి) కన్నుమూయక నిదురించునది చేప; యోనినుండి పుట్టియు ప్రాణములేనిదా (ఆలోచించి) యోనినుండి పుట్టియు ప్రాణములేనిది గ్రుడ్డు. సాగిపోక తిరిగెడి చక్రమనగా కుమ్మరి సారె ! సర్దారులారా ! నేను చెప్పినవి సరిపోయినవా?

2 సర్దా:– చక్కగా సరిపోయినవి !

సాంస:– మణి నేనింక కథనువేయవచ్చునా?

1 సర్దా:– అడుగుటెందులకు? ఆరంభించుము.

సాంస:– మీకథను నేను వెంటనే విప్పిచెప్పితిని కాని నాకథ విప్పుటకు మీకును మీఫిలిస్తీయులకును ఏడుదినములు గడువిచ్చుచున్నాను.

2 సర్దా:– ఎందుకీ పరిహాసము కథవేయుము

సాంస:– కథను మీరు విప్పలేక పోయినచో

1 సర్దా:– పందెమొడ్డుము

మీరా:– అచ్ఛ, అచ్ఛ మంచిమాట సెప్పినార్, పందెంలేని కథ పలావులేని విందు ఒకటే గదూ !

సాంస:– సరే ! నాకథను మీరు విప్పినచో ముప్పది నారబట్టలను, దుస్తులను నేను మీకిత్తును. విప్పలేకున్ననవి మీరువాకీయవలెను. సమ్మతమేనా?

2 సర్దా:– ముమ్మాటికి సమ్మతమే !

సాంస:– (తనలో) వీరికి నాస్వానుభవ సంఘటనము నొక కథగా నల్లిచెప్పెదు; (ప్రకాశముగా) సర్దారులారా ! కథవేయుచున్నాను సావధాన చిత్తులై ఆలకించుడు.

* ఘన భయంకరమైన గర్జనముజేసి
మృగములను జంపుకొని తిను మృగమునుండి
తిండి లభియించె కమ్మని తీపిగలిగి.
తీపిగలదేది? మృగమేది తెలుపుడింక;

సర్దారులు:– (పైకిజూచుచు ఆలోచించుచుందురు)

2 పారుడు:– (ప్రవేశించి) సాంసను బాబూ ! సత్యవాది మీ తల్లిదండ్రులతో మాట్లాడుచు నిన్నులోనికి రమ్మనుచున్నాడు

సాంస:- సర్దారులారా ! నేనిదే పోయివత్తును. ఏడుదినములు గడువున్నది గదా! నిదానముగా నాలోచించియే చెప్పుడు.

(సాంసను నిష్క్రమించును)

1సర్దా:- సత్యవాదిగూడా ఈవిందులో పాల్గొనినట్లున్నాడు. ఆతడు కుట్రపన్ని మనల నవమానించుటకు ఈకథ సాంసనుచేత వేయించియుండునా?

2సర్దా:- కథ విప్పగలిగినచో అవమానమేల కలుగును !

1సర్దా:- అసలు కథలో - భావమే గోచరించుటలేదు.

2సర్దా:- మనము కథ విప్పకున్నచో తన కథను తానైన వివరించి చెప్పవల యునుగదా ! అందుచేత కథలో భావముండితీరును.

1సర్దా:- తల చిట్లిపోవునట్లు ఆలోచించినను భావము స్ఫురించుటలేదు.

2సర్దా:- ఆ ... ఆ ... నాకు స్ఫురించినది.

1సర్దా:- ఏమిటది ?

2సర్దా:- ఒకచక్కని ఉపాయము

1సర్దా:- అపాయములేని ఉపాయమేనా ?

2సర్దా:- అపాయమెందులకు ? సాంసను భార్య మన స్వజాతీయురాలు. ఆమెను బెదరించి ఈ కథయందలి భావమును తన భర్త వలన తెలిసికొని మనకు చెప్పునట్లు ఒప్పించుకొందము.

1సర్దా:- అందులకామె అంగీకరించునా ? ఒకవేళ అంగీకరించినను తనభర్త కథభావమును ఆమెకెఱింగింప వలయునుగదా !

2సర్దా:- సరోజ తన భర్తకు కీడు కలుగునని తప్పక మనము చెప్పినదానికి ఒప్పుకొనును. పిమ్మట ఆమె తన పెనిమిటిని వేడుకొనినచో కథ యందలి రహస్యమును చెప్పగలడు: ఆడవారు అష్టకాలు సాచిన అడుగుదీసి అపలపెట్టగల మగవారెవరుందురు ?

1సర్దా:- నీవు చెప్పినది యుక్తియుక్తముగా నున్నది. రేపే మనము సరోజను

కలిసికొని కార్య సాధనకు ప్రయత్నింతము.

(అందఱు నిష్క్రమింతురు)

( సరోజ మందిరము )

**సరోజ:—** విందు సమయమున నాభర్త వినోదమునకై వేసిన పొడుపు కథ విప్పలేక సర్దారులు కినుకవహించిరి; వారి కినుక రానురానెట్లు పరిణమించునో ! తలచుకొన్న నాగుండె నీరగుచున్నది.

సర్దారులు:— (ప్రవేశింతురు)

సరో:— (ప్రవేశించిన సర్దారులనుజూచి) సర్దారులారా ! నమస్కారములు. అపూర్వమైన మీరాకకు కారణమేమి ?

1సర్దా:— సరోజా ! మీపెండ్లి విందునకు వచ్చినపుడు నీభర్త మాపై కథ వేయుటయును, పంచెము నిశ్చయించుకొని యేడుదినములలో మేమాకథను విప్పజాలనుటయును నీవెఱిగినదేగదా !

సరో:— ఔను. మీపై కథవేసినందులకు హృదయమునొచ్చి. పచ్చి పుండై వగచ్చుచున్నాను.

2సర్దా:— ఆ కథలోని భావము నీవలన తెలిసికొనుటకే యింతదూరము వచ్చితిమి.

సరో:— విజ్ఞానధురీణులగు మీకన్న నేనంత పరిజ్ఞాతనా ?

1సర్దా:— పరిజ్ఞాతవనికాదు. పతివలన కథయందలి భావము గ్రహించి మాకు చెప్పవలయును.

2సర్దా:— రేపే కథ విప్పవలసినదినము. కనుక ఈరాత్రి నీభర్తను మచ్చిక చేసి కథలోని రహస్యమును గ్రహించి తెల్లవారుసరికి మాకారహస్యము నందజేయవలెను.

సరో:— అయ్యో! ఇదెట్లు సాధ్యమగును. బలపరాక్రమ విజ్ఞాన సంపన్నుడగు నాభర్త నాకీ రహస్యమును చెప్పునా ! బాబూ ! ఈపని నావలనకాదు.

1సర్దా:— అటులైన మేము ఇశ్రాయేలీయునకు పంచెమోడి పరాభవము పొందవలసినదేనా ?

2సర్దా:– కథలోని రహస్యమును నీభర్తవలన గ్రహించి మాకు చెప్పకున్నచో ఫిలిస్తీయుల పరాభవమునకు నీవే కారణమని...

* ప్రేమతోడ నీహృదయ మర్పించుకొన్న
ప్రాణవిభుఁబట్టుకొని యాగపశువురీతి
కఱకుకత్తులదూసి నీకంఠ్లముందె
చంపెదము మాదుక్రోధాగ్ని చల్లబడగ ;

1సర్దా:– అంతేకాదు.

* నిన్నుగనిపెంచి యింతదానిని నొనర్చి
ప్రాణములు నీపయినిబెట్టి బ్రతుకుచున్న
పెద్దవాడైన నీతండ్రి బెగ్గడిల్ల
చిత్రవధజేసి నిన్ను హింసింతుమబల !

సరో:– సర్దారు బాబులారా ! శాంతింపుడు

* అంతవఱకెందుల కొకింతశాంతి వడిన
భర్తనర్థించి కథలోని భావములను
తెలిసికొనుటకు నేప్రయత్నింతు నిపుడె,
ఆగ్రహింపకుడయ్య సర్దారులార

2సర్దా:– ప్రయత్నించుటగాదు. మాపని పూర్తిచేయవలయును.

1సర్దా:– మాపని పూర్తిచేయకున్న నీకును నీవారికిని ప్రమాదము తప్పదని గుర్తించుకొనుము. జాగ్రత్త !

(సర్దారులు నిష్క్రమింతురు)

సరో:– హాదైవమా ! నేనెంత అభాగ్యురాలను. మొదటినుండియు మా పవిత్ర దాంపత్య జీవనమున కంతరాయములే తటస్థించుచున్నవి. సాంసనును పెండ్లాడితినని మాఫిలిస్తీయులిప్పటికే రుసరుసలాడుచున్నారు. ఇంతలో నిప్పుమీద నేయిబోసినట్లు నాభర్త సర్దారులతో పందెమొడ్డెను. ఇకవారి కోపానలమెట్లు చల్లారును ?

సర్దారులన్ను శాంతిపరచవలెనన్న నాభర్త వలన కథలోని రహస్యము నెఱిగి వారికి చెప్పవలయును. అట్లు చెప్పితినేని నాభర్త పందెమోడిపోవును గదా! ఈఓటమికి నేనే కారణమని నన్నుదూషింపకుండునా! అట్లని సర్దారులను వ్యతిరేకించిన నాభర్తయు నాతండ్రియు నాకు దక్కరుగదా! ఏమిచేయుదును. "ముందు నుయ్యి వెనుక గొయ్యి" యన్నట్లు నేనెటుబోవుటకును, ఏమి చేయుటకును తోచకున్నది. (ఆలోచించి) నాభర్త వలన కథలోని రహస్యమెఱిగి సర్దారులకుతెల్పి నావారిని కాపాడుకొనుటయే నాకర్తవ్యము.

(దిగులుతో తలవంచుకొనియుండును)

సాంసను:— (ప్రవేశించి తనలో) సరోజ ననుగాంచినతోడనే సూర్యరశ్మిసోకిన సరోజమువలె వికసించిన వదనారవిందగ్గా స్వాగతమిచ్చెడిది; నేడేలొకో చెన్నుదరిగి విన్నదనమున మిన్నకున్నది; కారణమేమైయుండును. ప్రేయసీ!

* కిలకిలలాడుచున్ ప్రణయగీతముబాడుచు నాట్యమాడుచున్
వలపులజూపుచున్ మధురవాక్సుధజిందుచు కౌగిలించి నా
కలఘు సుఖంబుగూర్చు కుసుమాస్త్రవిలోల కళావిలాసినీ!
పలుకవదేలనే! కలతబాసి మనంబులు పుల్కరింపగన్;

సరో:— నాథా! పరధ్యానమున నుండి మీరాకనే గుర్తింప కుంటిని. మన్నింపుడు. కాని ఒక్కసందేహము నన్నుపీడించుచున్నది.

సాంస:— ఏమిటా సందేహము.

సరో:— ఆఁ యేమియునులేదు. మొన్న మన వివాహభోజనానంతరము — ...

* దుస్తులను పందెమొడ్డి ఫిలిస్తు జాతి
తెలివితేటలు సాంతంబు తెలియగోరి
వీరులైన సర్దార్లపై వేసినట్టి
పొడుపు కథ విప్పి నాతోడ నుడువదగదె!

సాంస:— అదియా! నీసందేహము అకథలోని రహస్యము నాతల్లి దండ్రులకు సైతము చెప్పక దాచియుంచితిని

సరో:— తల్లిదండ్రులకు చెప్పకున్న సరియే! అర్ధాంగినగు నాతోనైన చెప్ప

గూడదా ! పురుషుడు తల్లిదండ్రులను విడిచి భార్యను హత్తుకొనునను పురాణవాక్యము నిరాధారమేనా !

సాంస:— ప్రియులారా ! రేపు ఫిలిస్తీయుల సమక్షమున కథవిప్పునపుడు అందఱును విందురను తలంపుతో ప్రత్యేకముగా, నీతో చెప్పనైతిని. ఇంతమాత్రమునకు అంత పెద్ద సందేహమా ! చెప్పెదను వినుము.

మన వివాహమునకు ముందుగా నొకప్పుడు తిమ్నాతు పట్టణమునకు వచ్చుచుండ మార్గమధ్యమున గర్జించి సింహరాజమొకటి నాపై దుమికినది. దైవబలముతో దాని దవడలు బట్టి చీల్చిచంపితిని. మఱికొంతకాలమునకు ఆ మార్గముననే తిరిగి వచ్చుచు ఆసింహకళేబరమునందొక తేనె తెట్టెను చూచితిని. నేను వేసిన పొడుపుకథలో బలమైనదా సింహమే! తీపిగలది అందలి తేనె!

సరో:— ఆహా ! వింతయైనకథ! నాథా! నాసందేహము తీరినది. పైరుగాలిలో కొంతసేపు విహరింతము రమ్ము.

(నిష్క్రమింతురు)



# తృతీయాంకము

## రెండవరంగము

రోజ, సాంసను, సర్దారులు ఆసీనులైయుందురు)

సాంస:- సర్దారులారా! నేను వేసినకథను విప్పుటకు గడువు నేడేగదా!

1సర్దా:- ఔను! నేడే!

సాంస:- అట్లయిన ముప్పది నారబట్టలు దుస్తులు తీసికొని వచ్చితిరా!

2సర్దా:- మేము అన్నియు సిద్ధముజేసికొనియె వచ్చితిమి; ముందు నీదుస్తుల విషయము చూచుకొనుము.

సాంస:- సరే! కథను విప్పుడు

1సర్దా:-

* మృగములను జంపుకొనితిను మృగమనంగ
నడవులందు చరించు సింహంబు గాదె!
తలచ మధురాతి మధురమై దానినుండి
తిండి దొరికిన దననది తేనెగాదె!

సాంస:- (తనలో) ఆహా! యేమిటీ విచిత్రము; నాకొక్కనికి మాత్రమే తెలిసిన ఈ రహస్యమును వీరెట్లు గ్రహించిరి! నోరుజారి నాభార్యతో నుడివి నందుకు తగిన ఫలమనుభవింప వలసి వచ్చినది; నాభార్యా ముఖమున నీరహస్యము బహిర్గతమైనది. కట్టెపోయి గొడ్డలిలోజేరినట్లు నాభార్య వీరితో జేరుకొన్నది. అందుచే వీరు నన్నోడింపగలిగిరి. మన బంగారము మంచిదైన కంసాలి ననవలసిన పనియేమున్నది? (సర్దారులనుచూచి) సర్దారులారా! నాకథయందలి భావమును చక్కగా ప్రకటించితిరి. నేను పందెమోడిపోతిని; మీకీయ వలసిన దుస్తులను రేపే మీకందజేసెదను. మీరికపోవచ్చును.

2సర్దా:- రేపు తప్పక పంపించవలయును.

(సర్దారులు నిష్క్రమింతురు)

సాంస:– (భార్యవైపు తిరిగి) ఓసీ! దుర్మార్గురాలా! నయగారముతో నావివేకమును మభ్యపరచి కథలోని రహస్యమును గ్రహించి నీస్వజాతీయులకు మెప్పును నాకు తీరని ముప్పును కలిగించితివి. భార్యవను కొంటినిగాని నాప్రక్కలో బల్లెమని తలంపనైతిని.

సరో:– నాథా! పందెమోడినందుకు పరితాపపడుచుంటివా! ఈయోటమి మన కొక విధముగా ఉపకారమొనరించినది.

(సమీపించును)

సాంస:– ఛీ! నయ వంచకీ! దూరముగానుండుము; నన్ను సమీపించిన నీప్రాణములు దక్కవు.

సరో:– స్వామీ! మీ ప్రాణములు దక్కించుకొనుటకే సర్దారులకు కథాబావమును చెప్పితిని; ఇందు నానేరమేమియునులేదు. నన్ను మన్నించుడు.

సాంస:– ఆహా! యెంతచక్కగ బొంకుచున్నావు. ఆడది బొంకిన గోడకట్టినట్లుండుననుట నాకిప్పుడనుభవమైనది.

సరో:– నాథా! మీరులేని సమయమున సర్దారులు నన్ను నిర్బంధించి కథా రహస్యమును మీవలన గ్రహించి నేను వారికి చెప్పకున్నచో మాత్రం రాత్రిని మిమ్ములను హత్య చేసెదమని చెప్పిరి. వారి నిర్ణయమునుండి మిమ్ము రక్షించుకొనుటకే నేనిట్లుచేసితిని; మీరు అపార్థముచేసికొన్న నాగతియేమి?

సాంస:– ఓసీ! ఆవిషయమును నాకు చెప్పినచో వారినింతకు ముందే వధించి యుందునుగదా! ఇదియంతయు నీకల్పన; నేను నమ్మను. నమ్మి యిప్పటికే మోసపోతిని. భర్తృ వంచకీ! ఈనాటినుండి నీకు నాహృదయమున స్థానములేదు. నీవు నాభార్యవుకావు. మన సంబంధమింతటితో తెగిపోయినది పొమ్ము!

(సరోజ భర్త పాదములపైబడ నతడు నెట్టివేయును)

స రో జ – కీ ర్త న

వలపే తీరినదా! తలపే మారినదా!
నా నేరమును సైచి నన్నేలుకొనుమ సఖా ॥వల॥

I బెదరింపులకు లొంగి - భీతి పడి పోయాను
మదిలోని నీగుట్టు - చదురు కెక్కించాను
చేతులారగకీడు - చేసికొంటిని స్వామి ॥వల॥

II నిన్ను కాపాడుకొని - నీతోడనుందునని
ఏమేమొ తలచితిని - నీమనసు కలచితిని
మన్నింపుమా నాథా - నన్నువిడిపోదగునా ॥వల॥

(తెరపడును)

# తృ తీ యా ం క ము

## మూ డ వ ర ం గ ము

(రాజు, మంత్రి - సర్దారులు ఆసీనులైయుందురు)
(సత్యవాది ప్రవేశించును)

సత్య:— ఏలినవారికి నమస్కారములు

రాజు:— మంత్రిశేఖరా! ఎవ్వడీ బైరాగి

మంత్రి:— ప్రభూ! ఒకప్పుడితడు రాజకీయముల రెచ్చగొట్టి తగిన శిక్ష ననుభవించినవాడు. సాంసనునకు గురుతుల్యుడు మనకు సంపూర్ణ వ్యతిరేకి !

రాజు:— ఓరీ ! రాజకీయములలో జోక్యము కలిగించుకోవలదని నీకెన్ని మారులో చెప్పితిమిగదా! ఆ సాంసనుతో చేరి నీవుచేయు విప్లవాత్మకమైన చర్యలు క్షంతవ్యములుగావు.

* హీనజాతీయుడైన సాంసోనుతోడ
కలసిరాజకీయంబుల కాలుమోపి
బొజ్జలను బెంచుకొను నిన్నుబోలినట్టి
వంచకులచేత శాంతిలభించునొక్కొ ?

సత్య:— ప్రభూ !

* పాలకుల నిబంధన ఫలాఫలములెల్ల
ప్రజల జీవదర్పణమున ప్రతిఫలింప

రాజకీయ సమస్యల రంగమందు
కాలుజెట్టక కాలంబు గడువగలవె !

**మంత్రి:–** ఓయీ! నీవు వచ్చిన పనియేదో ప్రభువులకు నివేదించుకొనుము.

సత్యః:– ప్రభూ ! ఫిలిస్తీయులకును ఇశ్రాయేలీయులకును దినదినము వైరమభివృద్ధియగుచున్నది. మీరెన్ని చండశాసనములజేసి బాధించినను ఇశ్రాయేలీయులు స్వాతంత్ర్య దీక్షవీడకున్నారు. ఈ విషయమును దేవరవారు దీర్ఘముగా నాలోచించుట మంచిది.

రాజు:– ఇశ్రాయేలీయుల నాయకుఁడగు సాంసనును బంధించిన, వారు తల యెత్తక చచ్చినట్లు పడియుందురు.

సత్యః:– అధోముఖముగా నుంచినను అగ్నిజ్వాలలు పైకిలేచునట్లు ఇశ్రాయేలీయులను బాధించుకొలది వారు ప్రకాశించుచున్నారుగదా ! ఇక సాంసన్ను బలశాలి, అతనిని బంధింపబూనుట వ్యర్థము.

రాజు:– అతని బలముచూచి మేము భయపడుదుమని తలంచితివా ! సర్దారులారా ! సాంసనుజాడ నెఱింగితిరా !

**1సర్దా:–** మహారాజా! విందునాటి వినోదప్రశ్నల రహస్యము మాకెఱిగించినదని సాంసను తన భార్యను విడనాడెను. మరల కొన్నాళ్ళకు భార్యకావలయునని తన మామయింటికి వచ్చెను. కాని అతని మామ సరోజను అంతకుముందే మరియొకనికిచ్చి పునర్వివాహము చేసినందున తన రెండవ కుమార్తెను పెండ్లియాడుమని కోరెను. అందులకు సాంసను సమ్మతింపక మీ ఫిలిస్తీయులనేమి చేసెదనో చూడుడని బెదరించి వెడలిపోయెను.

2సర్దా:– అట్లుపోయిన వాఁడూరకుండక మూడువందల నక్కలనుబట్టి రెండేసి నక్కల తోకలను ముడివేసి, దివిటీలుగట్టి నిప్పుముట్టించి తరిమి, మన ఫిలిస్తీయుల ద్రాక్ష ఒలీవ తోటలను గోధుమ చేలను నాశనము చేసినాడు. ఇప్పుడు ఏతాముకొండ లోయలో నున్నాడని తెలిసినది

రాజు:– ఛీ చెప్పుకొనుటకు మీకు సిగ్గులేదా!

మంత్రి:– ఒక్క సాంసనుని బంధింప మీకు శక్తిలేక పోయినదా!

సత్యః— ప్రభూ! ఇశ్రాయేలీయ నాయకుడగు సాంసనును బంధించిన అరాజకము ప్రబలునేకాని శాంతి సమకూరునా! నేనిప్పుడు సాంసను కడనుండియే వచ్చితిని. అతని సందేశము విని పిమ్మట మీరొక నిర్ణయమునకు వచ్చుట మంచిది.

రాజుః— ఓహో! సందేశమును గొనివచ్చితివా!

మంత్రిః— మనకు సందేశమంపునంతటివాడా సాంసన్ !

సత్యః— రాజా! సాంసన్ తనవాక్యములుగా మీతో నిట్లు విన్నవించుమనినాడు.

* కట్టిరిజెనిమమ్ము కపగండ్లనుబెట్టితిరింత వట్టు; మా
పుట్టినభూమిపై మమతబోదు; వ్యథాశ్రమబెట్టనేల; మీ
పట్టునువీడి రాజ్యము విభాగముజేసి సగంబొసంగు చో
నిట్టి వివాదముల్ గలుగునే! ప్రజలెల్లరు సంతసింపరే!

రాజుః— ఓరీ! ఇశ్రాయేలీయులకు ప్రత్యేకరాష్ట్రము కావలెనని పారిపోయిన సాంసను కోరికయా!

* అదరుచుబోయి కొండగుహలందు వసించుచునుంటుగాదు; మా
కెదురుగనిల్చి యిద్దరణి నెవ్వరు పాలనసేయ నర్హులో
కదనపుతీర్పులో తెలియుగాదగు; నూరక పిచ్చిపిచ్చిగా
వదరగనేల? నీవిటకు వచ్చినవారినిబట్టి పొమ్మికన్;

మంత్రిః— అంతియేకాదు.

* అసువులుగల్గి సాంసను నిజాకృతితో బ్రతుకన్ దలంచినన్
పసరమువంటి యాతని ప్రవర్తనపూర్తిగ త్రోసిపుచ్చి; తా
మనసమునువీడి మాప్రభుని మానితపాదములాశ్రయించి; బా
నిసవలె నుండవచ్చు; నవనీతల మించుక బంచియిత్తుమే!

సత్యః— మహాప్రభూ!

పరిమళమిచ్చు పూవు తలపైనివసించి వెలుంగు; లేద! త
త్తరు పదమూలమందొరిగి ధన్యతగాంచును; మానవంతు లీ
కరణిమెలంగ జూచెదరుగాని; భవత్కృత దాస్య జీవనా
చరణమునస్కులై బ్రతుకజాలుదురే! ప్రళయంబు వచ్చినన్;

రాజు:— ఓహో! సాంసనంతటి మానధనుండైన, ప్రత్యేకరాష్ట్ర మిమ్మని మమ్ము యాచించుటెందులకు?

సత్య:— ప్రజాశ్రేయస్సు కొఱకు ప్రభూ!

మంత్రి:— రాజోత్తమా! సాంసను సామాన్యుడుకాడు. మహాబలశాలి, బలశాలికి చోటిచ్చుట ప్రమాదము. ఒకవేళ రొట్టెముక్కంత రాజ్యమిచ్చినను వారు దానితో తృప్తిపడక దురాక్రమణదారులై మనదేశమును కబళింప జూతురు. వారిని నమ్మరాదు చేతులుకాలిన తరువాత ఆకులు పట్టు కొన్న ప్రయోజనమేమున్నది ?

1సర్దా:— నిజమే ప్రభూ ! సాంసను మహాపంచకుడు.

* విందుకుబిల్చి; మాపయినివేసె వినోదవిచిత్ర ప్రశ్నలన్
పందెమునొడ్డి మమ్ము నగుబాటులకున్ గురిజేయనెంచి; గ
ర్వాంధుడు; ప్రశ్నలందలి రహస్యములాతని భార్యవల్లనే
ముందఱగా నెఱింగి గెలుపున్గయికొంటిమి; రాజచంద్రమా!

2సర్దా:— మేమట్లు గెలిచినందులకీయవలసిన ముప్పదినారబట్టలను దుస్తులను రేపు పంపెదనని చెప్పి

* నిప్పయిమండి భార్యపయినన్గలహించి తొలంగిపోయి; మా
కప్పయినట్టి వస్త్రముల నంపుతలంపున 'నష్కెలోను' లో
ముప్పదిమందినిన్ముని మి ముప్పదిదుస్తుల మూటగట్టి తా
చెప్పునగొట్టి నట్లనుపజేసె; పరాభవసూచకంబుగన్.

రాజు:— ఈవిషయము మాతో చెప్పలేదేమి?

సర్దా:— సిగ్గుపడి చెప్పలేదు ప్రభూ

రాజు:— ఛీ! మీరసమర్థులు గనుకనే సాంసను ఆడినదాటగా పాడినది పాటగా నున్నది. ఓరీ సాంసనూ!

* శ్రీరంజిల్ల యశంబుగాంచిన ఫిలిస్తీయ ప్రభుత్వంబు దు
ర్వారంబంచు నెఱుంగవా! సమరకార్యంబందు పోరాడి నీ
వీరత్వంబును చూపకే ప్రజలపై విద్వేషణంబేల? నీ
గోరీకట్టెద! నీదువంశజులనే గగ్గోలు గావించెదన్ ;

మంత్రి:— ఓరీ ఫిలిస్తీయప్రాణాపహారీ! విప్లవకారీ !

* గుండియలులేక భయపడి కొండలందు
దాగి సందేశమనుచు, బైరాగి నిటకు
పంపితివి, నీదుశక్తి జూపింపరమ్ము
కడువడిన్, మగతనమింత గలిగెనేని!

సత్య:— న్యాయపాలకులారా! ఆగ్రహము కార్యాచరణమున కాటంకముగదా !

* శక్తిగలిగి సాంసను దేశ శాంతికొఱకు
ఆశపడి పంపుకొన్న సందేశములను
నల్వురాలించితిరి నేటికొల్వులోన
ఆగ్రహింపక ధర్మంబు నరయుడయ్య !

రాజు:— ఓరీ ! సాంసను మాయెడల ధర్మముగా ప్రవర్తించెనా !

* పెంచినపైర్లు నష్టపడ పెక్కగు నక్కలబట్టి నిప్పు ము
ట్టించుట ధర్మమా? కడువడిన్ సరదారులపైని కుట్రగా
వించుట ధర్మమా? క్షుభిత విశ్వవినాశక విప్లవంబు గ
ల్పించుట ధర్మమా? మన ఫిలిస్తిజులన్ దునుమాడ ధర్మమా?

సర్దారులారా! ఈదుర్మార్గుని చెఱసాలలో బడవేయుడు. తమ నాయకుడగు సాంసనును పట్టియిచ్చువఱకు ఇశ్రాయేలీయులను హింసింపుడు.

మంత్రి ప్రభూ ! అట్లుచేసినచో తన ప్రజాక్షేమమునుగోరి సాంసను మనకు పట్టుబడగలడు. సాంసనును బంధించుటకిది చక్కని మార్గము.

(రాజు మంత్రి నిష్క్రమింతురు)

(సర్దారులు సత్యవాదిని తీసికొని పోవుచుందురు)

కీర్తన

సత్యవాది:—

ఓ లోకేశా — నామొఱవినవా ! కరుణించి నను గనరావా !

I వీరేమిచేతురొ - వీరెరుంగరు
నెనరుజూపి మన్నింపుముదేవా
మార్చుమయ్యా ! రాక్షసహృదయం
చేర్చుమయ్యా ! నీప్రేమరాజ్యం ॥ ఓ ॥

II నీతిమంతులకు ఈలోకములో
నిలువనీడ కనిపించదాయెనే
ఏమిటయ్యా ! నీఆలోచన
ఇకలేదా ! మాజాతివిమోచన ॥ ఓ ॥

# చతుర్ధాంకము

## మొదటి రంగము

(ఏతాముకొండ; సర్దారులు, ఇద్దరు పౌరులు ప్రవేశింతురు)

1పౌరుడు:– సర్దారులారా! అదియే ఏతాముకొండ; ఆకొండలోయలో సాంసను నివసించుచున్నాడు; మీరు మాతో కలసి సాంసనును సమీపించినచో మీకును మాకును ప్రమాదము తప్పదు. కనుక మీరిందేనిలువుడు. మేము సాంసనుతో మాటలాడి ఒప్పించి మీకప్పగింతుము. అప్పుడు మా బాధ్యత తీరిపోవును. మీ రతని నేమిచేసినను మాకు సంబంధములేదు

1సర్దా:— సరే ! మీరు త్వరితముగా రావలయును. మేము మీ కొరకిచ్చటనే నిరీక్షించు చుందుము.

( పౌరులు ఒక వైపునకు పోయి నిలువబడి )

2 పౌరు:– ఈ కొండ దురారోహమై భయంకరముగా నున్నది. సాంసనుని సమీపించు టెట్లు ?

1 పౌరు:– సమీపించ వలసిన పని లేదు. ఇటనుండి కేక వైచిన నతడే మన కడకు రాగలడు.

పౌరులు:– సాంసనూ ! సాంసనూ !

సాంస:– (తెరలో నుండి) ఎవరువారు ?

1 పౌరు:– మేము ఇశ్రాయేలీయులమే ! నీతో మాటలాడవలసి వచ్చితిమి; భయములేదు; లోయనుండి వెలలిరమ్ము

సాంస:– (ప్రవేశించి) మిత్రులారా ! మన ఇశ్రాయేలీయ జనాంగము కుశలమా ? మీరింత దూరము వచ్చుటకు కారణమేమి ?

క్షేమంబెగద మిత్రులార ! సమతా సిద్ధాంత నిర్మాత; ని
ష్కామ్యుండార్యుడు సత్యవాదియును; నిశ్రాయేల్లను బిల్ల ల్నే

ఛ్చా మార్గ ప్రతి పాదనంబులకు దీక్షంబూని యున్నారె ? మీ క్షేమంబె నిరతంబుగోరి విజయశ్రీకై నిరీక్షించితిన్;

2 పౌరు:– మా క్షేమము గోరుట అటుంచి నీ విప్పుడు మాప్రాణముల మీదికే తెచ్చి పెట్టినావయ్యో !

సాంస:– మిత్రులారా ! నేనేమి చేసితిని ?

1 పౌరు:– ఏమిచేసితివా ? మన జాతీయులను దాస్య విముక్తులను జేయుటకై ఫిలిష్తీయులపై తిరుగుబాటు చేయలేదా ! తత్ఫలితముగ నిన్ను పట్టి వారి కప్పగించు వఱకు మన నందరిని చిత్రవధ జేయుటకు రాజశాసన మైనది.

సాంస:– అయ్యో ! మనలను వారు పెట్టిన హింసలను మఱచి నాపై నేరము మోపిరా ! అట్లయినను శిక్షింప వలయునుగాని అమాయికులగు వారి నందరిని హింసించుట ధర్మమా !

2 పౌరు:– "ధర్మము ధర్మ"మనిన సత్యవాదిని చెఱసాలలో వేసి బాధించుట నీ వెఱుగవా ?

సాంస:– ఆ ... గురు దేవులగు సత్యవాదిని చెఱలో వేసి బాధించిరా ! చీమకైన నపకారము చేసి యెరుగని ఆశాంతి దూతను హింసింప వారికి చేతు లెట్లాడినవి ! మంచివారికీ లోకమున తావుండదు.

పౌరు:– మేము చెప్పినట్లు నీవు చేయకున్న మన ఇశ్రాయేలీయులందరికిని ఈ లోకమున తావుండదు.

సాంస:– సహోదరులారా ! మీరు చెప్పునది నాకర్థమగుటలేదు. ఇప్పుడు నన్నేమి చేయమందురు ? జాతి శ్రేయస్సు కొఱకు నా జీవములనైన వదలుటకు సిద్ధముగా నున్నాను. నారక్త పానముతో జాతికి విముక్తి కలిగిన నిక నాకు కావలసినదేమున్నది.

2 పౌరు:– సాంసనూ ! జాతి నుద్ధరించు నీవంటి వారే దేశభక్తులు. కాని దేశ మాతను జనించి పెరిగి పెద్దవారై విదేశ వికృతాచార మోహితులగు వారి

వలన దేశమున కుపయోగ మేమున్నది ?

1 పౌరు నిన్ను మేము ప్రభుత్వమున కప్పగించిన మమ్ము వారు హింసింపరు. నీవు మామాట వినవని సర్దారులను తోడ్కొని వచ్చి వారి నల్లంత దూరమున నుంచితిమి.

సాంస:- మిత్రులారా ! నేను మరణింపవలయునని యేనా మీ యుద్దేశ్యము ?

2పౌరు:- నీవు మరణించిన మాకేమి వచ్చునయ్యా? కాని మా బాధ విడుగుడ గుటకు నిన్ను సర్దారులకు పట్టియిచ్చుటయే మాపని; అంతట మా భారముతీరును. తరువాత నీయిష్టము.

సాంస:- అట్లులైన నన్ను బంధించి మీబాధ్యత నెరవేర్చుకొనుడు.

( పౌరులు బంధించి సర్దారుల చేతులకప్పగింతురు )

1పౌరు:- సర్దారులారా ! మీరు కోరినట్లు సాంసనును మీకప్పగించితిమి; మాబాధ్యత తీరిపోయినది. ఇక మేము పోయెదము.

(పౌరులు నిష్క్రమింతురు)

1సర్దా:- ఓరీ ! గర్వాంధుడా !

నరపతి శాసనంబొక తృణంబుగ నెంచి భయంబువీడి యెం
డటిని ! వధించి దొంగవలె దాగిన రోజులుపోయె; నేటికిన్
దొరకితి వెందుబోగలవు; దుర్మతి! సింహము తారసిల్లినన్
కరి యెదిరించి బైటబడ గల్గునే: ప్రాణము పాయకుండునే !

2సర్దా:- ఓరీ ! నీచా ! నీకు పోగాలము దాపురించినది.

మదమున కన్నుగానక యమానుష కార్యము లాచరించి సం
పదలనుకొల్ల గొట్టితివి; పంట పొలాల నొలీవ తోటలన్
ముదమున పాడుజేసితివి; మూర్ఖుడ ! నీకిక దిక్కెవండురా
పద పద రాజసన్నిధికి పాప ఫలంబు తొలంగి పోవునే !

సాంస:- (నవ్వి) అధికారమున్నదని అదరి పడకుడు. మీ ఫిలిస్తీయులను బాధించి నప్పుడు మీమగతనమేమైనది ? నన్ను బంధింప చేతగాక

ఇశ్రాయేలీయులను హింసించిన పిరికి పందలు. మీరు నన్నేమి చేయ గలరు? ద్రోహులారా! ఈబంధముల విదళించి యిప్పుడే మీపని బట్టెద.

(సొంసను బంధములు విదల్చిత్రెంచుకొనగా సర్దారులు పారి పోవుదురు

క్రిందనున్న గాడిద దవడ ఎముక నందుకొని)

సొంస:- ఓరీ ! సర్దారులారా ! పారిపోయెదరేల? నిలు నిలుడు.

ఎచ్చోటి కేగినన్ విడుతునే ! యధికార మదాంధులార ! మా
పచ్చని జాతి జీవనము పాడొనరించుటె గాక ! నాపయిన్
కచ్చ వహించినారు; కులకాంతలు గొల్లునవేడ్వ మీదు గో
ర్వెచ్చని రక్తమాని విహరించెద ! విశ్వశుభంబు గూర్చెదన్;

(వడిగా సొంసను తెరలోనికిపోయి ఆయాసము నభినయించుచు ప్రవేశించును)

సొంస:- యెహోవాదేవా ! అల్పుడనగు నేను నీయాత్మబలంబున వేయిమంది ఫిలిస్తీయులను ఈ గాడిద యెముకతో సంహరించితిని, "నీప్రక్కను వేయిమంది పడినను నీకుడి ప్రక్కను పదివేల మంది కూలినను ఏఆపాయము నీ యొద్దకు రాదన్నిన" నీవు నా కండగానుండ నన్నెవరేమి చేయగలరు తండ్రీ!

శత్రువులతో పోరాడి అలసిపోతిని. అయ్యో ! ఆయాసమునకు తోడు దాహబాధ అధికమగుచున్నది! ఈ పరిసరముల నీరెచ్చటను కన్పిం చుటలేదు. అబ్బా! శరీరము నీరసించి కండ్లు తిరుగు చున్నవి;

ఎఱ్ఱ సముద్రంబు నిరుప్రక్కలకు ద్రోసి
బాట నేర్పరచి కాపాడినావు;
జుగుప్త దాస్యంబు నపనయింపగ నెంచి
పిల్చి మోషేను పంపించినావు;
పది చట్టముల రాతి పలకల చేజేత
దీవించి జనుల కందించి నావు;
శిలనుండి జలముల చిందించి ప్రీతిమై
దీనుల దాహంబు దీర్చినావు;
మాటతడబడె; కనుచూపు మందగించె

ప్రిదిలె ధైర్యంబు నాలుక పిడుచ గట్టె;
ఉదక మిచ్చి నా ప్రాణవాయువుల నిల్పి
దీనుడను నన్ను బ్రోవవే ! దేవ దేవ !

సర్వేశ్వరా ! క్షణము క్రిందట సింహబల మొసంగి, వేయిమంది ఫిలిస్తీయుల నవలీలగా జయింప జేసిన నీవు నన్నీ దాహ బాధతో మరణింప జేయుదువా ! పరమేశ్వరా ! నీ చిత్తమెట్లున్న నట్లే కానిమ్ము; (తెరలో పెద్ద ధ్వని) ఆ ... ఏమిటాధ్వని, ఎక్కడిదీ నీటి ధార ! ఆహా ! పరమేశ్వరా ! నీ వెంత దయాసముద్రుండవు, నాదాహము దీర్ప భూమిని బ్రద్దలించి నీరు పైకి వెచ్చితివా (లోనికేగి మరల వచ్చి ) ఎంతతీయని పానీయము, ఆయాసము పోవుటయే గాక నీరు త్రాగుట వలన అద్భుతమగు శక్తి వచ్చినది లోకరక్షకా నీకు స్తోత్రములు ( ఆలోచించి ) నేనిప్పుడేమి చేయవలెను ? దెబ్బ తిన్న ఫిలిస్తీయులు ఈ ప్రాంతమును ముట్టడింపక మానరు. నేనిటనున్న ప్రమాదము కలుగవచ్చును. కనుక సమీపమదంలి గాజా పట్టణ వేశ్యవాటికలో నీరాత్రి తల దాచుకొని వేకువనె లేచి మఱియొక చోటి కేగెద !

(ఒకవైపున సాంసను లోనికేగును మరియొకవైపున సర్దారులు ప్రవేశింతురు)

1సర్దా:– సాంసను ఈ గాజా పట్టణములోనే ప్రవేశించెను. రాత్రివేళ నతని పట్టుకొనుట మిక్కిలి కష్టము. కనుక పట్టణ సింహద్వారముకడ మన సైనికులతో పొంచియుండి అరుణోదయమున నతని వెదకి పట్టు కొందము.

2సర్దా:– నిజమే ! ఇంత చీకటిలో పట్టణములో ప్రవేశించి యతని నెట్లు కనుగొనగలము. పట్టణమున ప్రవేశించిన వాడు తిరిగి తప్పించుకొని పోకుండునట్లు పట్టణపు గవని యొద్ద మఱికొందఱిని కాపలా బెట్టుదము.

1సర్దా:– మనమనుకొన్న విధముగా చేయుటకు మన సైనికులను హెచ్చరింతము రమ్ము

( సర్దారు లొకవైపున లోనికేగ సాంసను మఱియొక వైపున ప్రవేశించును )

సాంస:— ఇప్పటి కర్ధరాత్రి గడచినది. నన్ను బంధించుటకు సర్దారులు సైనికులతో వచ్చినట్లు వారి సంభాషణల వలన తెలియుచున్నది. ఇదియే పట్టణ సింహద్వారము ( చెవియొగ్గివిని ) ఫిలస్తీయులిందే యున్నారు. నేను తప్పించు కొనుటెట్లు? తెల్లవారినచో వీరునన్ను బంధింతురు. ( ఆలోచించి ) ఏమైన కానిమ్ము. ఈ ద్వార బంధములనూడబెరికికొని ఎదురైన ఫిలిస్తీయుల మదమడంచుచు పరుగెత్తెదను గాక !

(సాంసను ఒకప్రక్కగా లోనికేగును సర్దారులు మఱియొకప్రక్క ప్రవేశింతురు)

సర్దా:— అడుగో ! సాంసను; తలుపు దర్వాజా నూడ బెరికి భుజమున బెట్టి కొని పరుగెత్తు చున్నాడు;

2సర్దా:— తగ్గవయ్యా ! ఈ చీకటిలో వానివెంట నంటిన నెందఱినైన చంపగలడు

1సర్దా:— నిజమే ! అతని బలము మన మెఱుగనిదికాదు. వాని కెదురైతిమా మనల నూరక పోనీయడు-

2సర్దా:— సాంసనున కింత బలమెందున్నదో! ఆబలమెట్లు వచ్చినదో తెలిసికొనుట మంచిది.

1సర్దా:— తెలిసికొనవలసినదే కాని ముందు వాడెటుబోవునో గమనింపవలయును గదా , పోదము పద !

( నిష్క్రమింతురు )



# చతుర్థాంకము - రెండవరంగము

( తెరముందు సాంసను ఏకాంతముగా నుండును )

సాంస:— అయ్యో! నేనెంత దురదృష్టవంతుడను! ఇరువదేండ్లు ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతిగా నుండి తుదకు ఫిలిస్తీయులకు భయపడి అజ్ఞాత వాసినై మెలగ వలసి వచ్చినది. ఈ స్థితిలో మొన్న దాగోను దేవతాలయమున డెలీల అను వేశ్యయొక్క నాట్యమును చూచితిని. అయస్కాంత మినుమునువలె ఆమె సౌందర్యము నన్నాకర్షించినది. కన్ను మూసినను తెఱచినను 'డెలీలా' రూపమే కన్పించు చున్నది. ఆమెకు వశమైన నా మనస్సును త్రిప్పుకొనలేక పోవుచున్నాను—డెలీలా.

చక్కని మోము దామర; ప్రసన్న విలోచన పంక్తి; చేతికిన్
జిక్కని కౌను; నమృతము చిందెడి మోవియు; కంబు కంఠమున్
క్రిక్కిరి చన్నులున్; సొగసు కీల్జడలున్; కనులార గాంచినన్
మక్కువ గల్గి నిస్గదియ మానునె! యెంత విరాగి యేనియున్;

చితి శరీరమును మాత్రమే దహింప మన్మథ చింత శరీరమును హృదయమును గూడ దహింప జేయు ననుట వాస్తవమే! — ఇనుప కచ్చడములు ధరించిన యోగీశ్వరులు సైతము కాంతల కడగంటి చూపులకు కరగి పోదురు గదా! ఎంతనిగ్రహించినను నామనసు డెలీలా వైపు పరుగెత్తు చున్నది; ఆమెవలన నాకు అమర సుఖము లభించునని ఆశ కలుగు చున్నది. అదిగో అకనుపించునదే డెలీలా మందిరము. లోనికే గెద గాక.

(లోనికేగును—వెంటనే తెరయెత్తబడగా
డెలీలా పాట పాడుకొను చుండును)

## డెలీలా మందిరము

సాంస:– (ప్రవేశించి) విలాసవతీ ! నేను పరదేశిని; నేడిచ్చట విశ్రమింప వీలగునా ?

డెలీలా:– ఎవరు మీరు ? (ఆలోచించి) మీ పేరు...సాంసను గదా !

సాంస:– నా పేరు నీకెట్లు తెలిసినది ?

డెలీ:– ఇశ్రాయేలీయుల నాయకుడ వగు నీ పేరెవరికి తెలియ కుండును ?

సాంస:– పేరు తెలిసినంత మాత్రమున ఈ పేరుగల వాడితడని గుర్తించుట కష్టముగదా !

డెలీ:— ఒకసారి చూచిన వారిని గుర్తించుట సులభము కాదా !

సాంస:– నన్ను నీవెప్పుడు చూచితివి ?

డెలీ:— దాగోను దేవతాలయమున నేను నాట్యము చేయునపుడు

తదేక దృష్టితో నీవు నావంక చూడలేదా ? నాట్యానంత
రము నిన్ను కలిసికొన ప్రయత్నించితిని, కాని నీవు కన
బడక పోతివి. నాటినుండి నాస్థితి యేమని చెప్పుదును ?

* కనులకు నిద్రరాదు; మఱి గానముపై ననురక్తి లేదు; భో
జనము రుచింప; దెప్పుడు విచారము తప్పదు; నీ స్వరూపమే
క్షణమున గంటినో: మనసు చంచలమయ్యెను: మన్మథాగ్నిలో
తనువు దహింపనీక; మమతన్ దరిజేరి సుఖంబు గూర్చుమా !

సాంస:– మోహనాంగీ ! నిన్ను జూచినది మొదలు నీవలె నేనును విరహవేదన ననుభవించుచు నీ యిల్లు విచారించియే వచ్చితిని. అపురూప సౌందర్యవతివగు నిన్ను చూచి నాహృదయ మూరట జెందినది. చెలీ,

కంటిని నీదురూపు: పాడగంటిని నీనటనా విలాసముల్
వింటిని నీ మృదూక్తులను; విశ్వవిధాత యెహోవదేవు డే
మంటిని దీసి నిన్నిటుల మానినిగా సృజయించినాడొ ! నా
కంటికి పర్వమై మెఱుపుగా కనిపించితి; వో విలాసినీ !

డెలీ:— మనోహరా ! మానవ జన్మ మెత్తినందులకు – భోగముల ననుభవిం
చుట కన్న మఱి యేమున్నది ?

* పుట్టిన జీవికోసరము పొంచి కనుంగొనుచుండె మృత్యు- వే
పట్టున నే నిమేషమున ప్రాణము పోవునొ ! చెప్పలేము; కా
బట్టి యనంత భోగరస వారిధిలో నిలువీత గొట్టుచున్
గట్టుకు చేరుకొందము సఖా ! సుఖ సంపద లుప్పతిల్లగన్ ;

సాంస:— సఖీ ! నీచమత్కార వాచా నైపుణ్యమునకును ఐహిక నీతి శాస్త్రోప
దేశమునకును మిక్కలి సంతసించితిని.

డెలీ:— అటులైన ఎప్పుడును నన్నువిడిచి పెట్టి పోననియు, నీహృదయమున
నాకు మఱుగైన దుండదనియు చెప్పగలవా ?

సాంస:— నాహృదయమే నీయదికదా ! అట్టియెడనే నెక్కడకు పోగలను ?

* ధన సముపార్జనంబె యొకధర్మముగా గల వేశ్యాజాతిలో
జననము నొందియున్ హృదయ సారసమిచ్చి సమాదరించి ;ని
ర్ధనుని ననున్ వరించి కడు ధన్యుని జేసిన మాన్యురాల ! నా
తనువు మనమ్ము నీదె ! ప్రమదమ్ముల దేలగరమ్ము సుందరీ !

( నిష్క్రమింతురు )

## డెలీలా గృహము

( డెలీలా అలంకరించుకొనుచుండ సర్దారులు ప్రవేశింతురు )

డెలీ:— సర్దారుబాబులారా ! రండి రండి ! అలవాటు లేనిమీరు మా యింటి
కరుదెంచుట ఆశ్చర్యముగా నున్నది; ఈ యాసనములపై కూర్చుం
డుడు.

1సర్దా:— కూర్చుండుటకు రాలేదు; నీవలన నొక కార్యము సాధింప వచ్చి
తిమి.

డెలీ:— నావలన నే కార్యమగును. అబలను, అడుదానను నన్నుపహేళన
చేయుచుంటిరా !

2సర్దా:– దేవుడేర్పరచిన స్త్రీపురుష లింగ భేదములు తలక్రిందులగు చున్న ఈ నాగరికతా ప్రపంచమున స్త్రీలు చేయలేని పనులేమున్నవి నీవు మాకు సాయపడుదువనియే వచ్చితిమి.

డెలీ:— అంతమాట అనకండి. నావలన కాదగిన కార్యమేదో తెలియజేయుడు. సర్దారులగు మీ మాట జవదాటగలనా ?

1సర్దా:— ఫిలిస్తీయ ప్రభుత్వముపై తిరుగుబాటు చేసిన సాంసను నీకు విటుడై నీయింట నున్నాడని తెలిసి కొంటిమి.

డెలీ:— నిజమే ! కొంతకాలమునుండి సాంసను నన్ను మోహించి నాపంచ గాచి యున్నాడు. కాని ఇప్పుడింటిలో లేడు.

2సర్దా:– ఇంటిలో నున్న మేమేల వత్తుము.

డెలీ:— అతనిని బంధింప వచ్చితిరని తలంచితిని.

1సర్దా:— బంధించుట కెన్నియో పర్యాయములు ప్రయత్నించితిమి; కాని మా ప్రయత్నములన్నియు వ్యర్థమగు చున్నవి. అతడు మహాబల వంతుడు.

2సర్దా:– సాంసనునకు అంతటి బలమెట్లు కలిగెనో ! అబలమెట్లు తొలగునో ! నీవతనిని లాలించి తెలిసికొని మాకెఱిగింప వలెను.

1సర్దా:– అట్లు చేసితివేని వేయి వరహాలు నీకు బహుమాన మిత్తుము.

డెలీ:– సర్దారు మహాశయులారా ! నన్ను నమ్మివచ్చిన వానినట్టేట ముంచుట న్యాయమా ?

మీపయి పంతగించుటది మేలని నేను వచింప లేను; నా
రూప విలాసముల్ గని నిరూఢిగ నన్ను వరించి నమ్మి: నా
ప్రాపున నున్న వీరునకు ప్రాణ వినాశన మాచరించినన్
పాపముగాదె ! మావలపు బంధము ద్రెంచుట మీకు న్యాయమా !

2సర్దా:— డెలీలా ! న్యాయా న్యాయములతో మాకు పని లేదు ; మేము చెప్పి

నట్లు చేయకున్న వేయి వరహాలనే గాక నీయాయువులను గూడ పోగొట్టు కొందువు.

డెలీ:— సర్దారులారా ! మీకు కోపము కలిగించితిని మన్నిపుండు. శత విధ ముల ప్రయత్నించి మీకు సంతోషము కలిగింతును. సాంసను మన లను జూచిన ప్రమాదము వాటిల్లును. పోయిరండు.

(సర్దారులు నిష్క్రమింతురు)

డెలీ:— అయ్యో ! సర్దారులు చెప్పినట్లు చేయకున్న నన్ను బ్రతుకనీయరు.

నన్ను నమ్మివచ్చిన సాంసనునకు నేనెట్లు కీడు చేయుదును. ఇప్పు డేమి చేతును. సాంసను తన రహస్యమును వెల్లడించినచో సర్దా రుల వలన నతనికి ప్రమాదము తప్పదు. వెల్లడించకున్న నాకు నాకు ప్రమాదము సంభవించును. ఎంత ఆలోచించినను మా యిరువురిలో నొకరికి మరణము తప్పదు. తనకు మాలిన ధర్మము మొదలు చెడ్డబేరమన్నట్లు ముందు నా ప్రాణముల మీదికే వచ్చి నపుడు సాంసను నెట్లు కాపాడు కొందును. ఇక సాంసను వలన నాకదు ప్రయోజనమే మున్నది; లాలన జేసి సాంసను బలరహస్య మెఱింగి ధన ప్రాథముల కాపాడు కొనియెదగాక ! అడుగో సాంసను వచ్చు చున్నాడు. విచారముతోనున్నట్లు నటించెదను.

సాంస:— ఆహా ! యేమి యీ వైపరీత్యము నే నింట కాలిడగనే కౌగిలించు కొను నా డెలీలా నేడేలకో విగతభరణయై విచార సాగరమున మునిగి యున్నది. సమీపించి విచారించెదగాక ! ప్రేయసి !

* స్వామి యటంచు నన్గదిసి స్వాగత మిచ్చి సమాదరించు నా
కోమలి ! ఎందుకీ ప్రణయకోపము ; నాయపరాధ మెద్ది ; నీ
మోమటు త్రిప్పనేల ? మునుముంయుగ, నాకెఱిగింప రాదటే
యేమిటి కీ విచారము సఖీ ! అనురాగ విభాజకంబుగన్;

డెలీ:— నాకు విచారముగాక మఱేమగును; నాసర్వస్వమును నీకు సమర్పించి నను నీవు మాత్రము నాకు మనసీయక మెలగు చుంటివి,

సాంస:- సఖీ! నామనశ్శరీర జీవములనెన్నడో నీయధీనమొనర్చితినిగదా! నీకిప్పుడీ యనుమానమేల పొడమినది.

డెలీ:- మనసువిప్పి నీపూర్వచరిత్ర నాతో నెప్పుడైన చెప్పితివా!

సాంస:- మనోహరీ! నేనిశ్రాయేలీయుడనని ఫిలిస్తీయులు నన్ను బంధింప ప్రయత్నించుటవలన వారినెందఱినో హతమార్చి ప్రచ్ఛన్నుడనై నీపంచజొచ్చితినని నీతో చెప్పలేదా! ఇప్పుడెందుకీ నిందమోపుట.

డెలీ:- ఫిలిస్తీయులను సంహరించిన విషయము నీవు చెప్పకముందే నేను వినియుంటిని. కాని -

* వేవురు ఖడ్గపాణులగు వీరులు పైబడిచంపజూచినన్
కేవల సింహకండవయి గెల్పు వహించు మహాబలంబు నీ
కెవ్విధిగల్గెనో! మఱలనెట్లు తొలంగెనో! విప్పి చెప్పినా
భావములోని శంకనెడబాపుసఖా! అనురాగముండినన్.

సాంస:— సుందరీ! స్త్రీలు కోరదగినవి విడిచి నా బలాబల విజ్ఞాన వాంఛ నీకేల పొడమినది.

* విలసిత పుష్పముల్ మదికి విందొనరించు పదార్థ జాలముల్
వలువలు సొమ్ములున్ వివిధ వస్తు చయంబులు భూషణంబులున్
లలనలు గోరు చుంద్రు మగలన్; మఱి నీ వలెనే బలంబెటుల్
కలిగెనొ? తొల్గునో? తెలియగా గమకింతురె చారులోచనా!

డెలీ:— నాపై ప్రేమయున్న చెప్పరాదా! లేకున్న మానివేయరాదా! ఎందుకీ యెత్తిపొడుపు మాటలు.

సాంస:- సఖీ! నీపై ప్రేమలేకేమి? చెప్పుచున్నాను వినుము. ఏడు నిరవంజీ చువ్వలతో నన్నుబంధించిన నాబలముతొలగి సామాన్యుడనయ్యెదను.

డెలీ:— నీవు చెప్పినదెంతవఱకు నిజమో! నిరవంజిచువ్వలను తెప్పించి పరీక్షించినగాని నా సందేహము తొలగిపోదు.

సాంస:— అట్లే కానిమ్ము

డెలీ:— మనోహరా ! నా మనోవేదన తొలగించితివి. రమ్ము పూదోట కేగుదము.

(నిష్క్రమింతురు)

(సాంసను డెలీలా ఆసీనులై యుందురు)

డెలీ:— మనోహరా ! యెందుకీ యసత్యవాగ్దానములు — నాతో నిజము చెప్పుట కిష్టము లేదనిన ఒక్క మాటతో తీరిపోవును గదా !

సాంస:— డెలీలా ! నీతో నిజము చెప్ప కుందునా !

* క్రొత్తవై యే పనికి బెట్టుకొనని యట్టి
కలయ పేనిన త్రాళ్ళతో గట్టిన యెడ
స్థిర యశంబును గన్నవా సింహబలము
తొలగి పోవును వినగదే ! తోయ జాక్షి !

డెలీ:— ఇంతక్రు ముందు నీవు చెప్పినట్లు ఏడు నిరవంజి చువ్వలతో నిన్ను బంధించి ఫిలిస్తీయులు వచ్చుచున్నారని బెదరించినంతనే నిర వంజి చువ్వలను గడ్డి పోచల వలె త్రెంచిన నీవు పేనిన త్రాళ్ళతో బంధింప బడుదువా ! ఎందుకీ వట్టి మాటలు —

వలపు గలదేని సత్యంబు పలికి నన్ను
కల్పి మెలగుట్టొ ! లేకున్న తొలగి చనుటొ !
తెల్పుకొనుము నీ కపటంబు తెలిసి పోయె;
మనసు నీయని మమత సమ్మతము గమనె ?

సాంస:— డెలీలా ! నిన్నెంత ప్రేమించినను నన్ను నమ్మక పోతివి గదా !

డెలీ:— నిజము చెప్పిన నమ్మక మేల కలుగదు.

సాంస:— డెలీ! పరిహాసము కాదు వినుము నాతల వెండ్రుకలు ఏడు జడలుగా నల్లి మేకులకు కట్టి వైచిన నేను దుర్బలుడ నగుదును.

డెలీ:— ఇది మాత్రము నిజమన్నియెట్లను కొందును.

సాంస:— నాకు నిద్రవచ్చుచున్నది. ఇంక నన్నాయాస పెట్టక నీ యంకతల మున పరుండనిమ్ము.

(సాంసను డెలీలా తొడపై పరుండును –
డెలీలా పాట పాడుచు జడలల్లి మేకులకు కట్టును)

డెలీలా :— —: కీర్తన :—

కలత లన్నియు వీడి నేడే – కనుమూసి నిదురించరా ... ॥ కల ॥

I ప్రాణాలతో బట్టి బంధింపకున్న
సర్దారులే నన్ను చంపందలంచి
ఏదారి లేక నిన్నప్పగింప
ఈ నాడు ఒప్పందమేర్పరచు కొంటి
అనురాగ బంధంబె తెగత్రెంచుకొంటి॥ కల।

II పాప పుణ్యాలు పరికింప లేను
ప్రాణాలపై ఆశ విడనాడలేను
బ్రతికితే చాలు బలు సాకు తింటూ
ఏకాకిగా నైన జీవింప గలను॥ కల॥

డెలీ:– చెలికాడా ! లెమ్ము ! లెమ్ము ! ఫిలిస్తీయులు వచ్చి పైబడుచున్నారు.

సాంస:– (మేకులు ఊడబెరికికొని లేచి ) ఫిలిస్తీయులెక్కడ? ఎవ్వరును లేరే! డెలీలా ! కమ్మని నిద్రపాడు జేసితివి.

డెలీ:– ఫిలిస్తీయులు వచ్చిరని చెప్పుట నిన్ను పరీక్షించుటకే ! నన్నెన్ని మారులు వంచించితివి.

సాంస:– (చేయిపట్టుకొని) డెలీలా! కోపము వచ్చినదా?

డెలీ:– (చేయి విదల్చి) ఛీ ఇక నన్నంటకుము

నమ్మి చెడితిని నీకుటిలమ్ము దెలిసె
పరిహసించితి నీవు దబ్బరల నాడి
మనసు విరిగిన నతికింపమార్గమేది?
పొమ్ము నను వీడి; యింక నీ పొత్తువలదు;

(డెలీలా లోనికేగును తెరపడును)

# పంచమాంకము

## మొదటి రంగము

(సాంసను ఏకాంతముగా నుండును)

సాంసః— అహా! నా బలము తొలగు విధానము చెప్పుమని డెలీలా నన్నెంత వత్తిడి చేయుచున్నది; నా ప్రాణములకేదో ముప్పు దెచ్చి పెట్టుటకే నన్నింత గట్టిగా నొక్కుచున్నది; లోకమున స్త్రీ జాతిని నమ్మరాదు గదా! అట్లని పురుషుడు ప్రత్యేకముగా బ్రతుక నేరడు; బురదలో సరసిజము పుట్టినట్లు స్త్రీ జాతిలో మాత్రము శీలవతులులేరా: అట్టి శీలము వారకాంతయగు డెలీలా కెట్లు వచ్చును. వేశ్యాల విధానము నాకిప్పు డర్థమైనది.

వావివరుసలెల్ల వర్జించి పురుషుని
గనినంత కనుగీటి కదియబిల్చి
అనురాగమనుచు నొయ్యారంబు నొలికించి
కొండంత వానిని క్రుంగదీసి
అను దినంబును సమస్తైశ్వర్యముల తోడ
రక్త మాంసాదులు లాగివైచి
ఇంకేమి పని? లేచి యిలువీడి పొమ్మని
చీవాట్లతో బొచ్చె చేతికిచ్చి
కుక్క నదలించి బయటకు గొట్టినట్లు
తరిమి; మఱియొక విటునకు స్థాన మొసగి
వానికి మొదటివాని త్రోవలను జూపి
వల్లకాటికి చేర్చుదే; వారకాంత!

తెలిసి తెలిసి నే నీ డెలీలా సంపర్కము నేల కోరితిని; యిప్పుడీ మెను వీడిపోవమనస్సొప్పకున్నది. నా బలము పోవు విధాన మెఱింగించిన నా ప్రాణముల కపాయము కలుగును. యుక్తితో తప్పించుకొన జూచితిని గాని ప్రయోజనములేకపోయెను.

నా బల రహస్యంబెఱింగింపనిచో డెలీలా నన్ను విడిచి పెట్టును. డెలీలాను విడిచి నేనొక్క నిమిషమైనను జీవింపలేను. నా బలము

పోయిన పోవుగాక! మరణ మాసన్నమైననగుగాక! డెలీలా కోర్కెదీరుటయే నా కర్తవ్యము.

డెలీ:- (ప్రవేశించి) ఛీ! ఎన్నిసారులు చెప్పినను కుక్కవలె నాయిల్లు విడిచి పోవు; నీకు సిగ్గులేదా!

సాంస:- కుక్క విశ్వాసము గల జంతువు; దానికున్న గుణము మానవుల కున్న ప్రపంచమే బాగుపడును గదా!

డెలీ:- నీ బాగు నీవు చూచు కొనుము! నాదారి నేను చూచు కొందును.

సాంస:- ప్రియురాలా! అట్లనకుము—మనయిరువురి దారి యొక్కటేయనుము.

గడచినవి మఱచి నన్నును గ్రహింపుము: నిజము చెప్ప నిశ్చయించి తిని

డెలీ:- ఇంతకు ముందు అబద్ధముచెప్ప నిశ్చయించితివి కాబోలు.

* మనసు నందొక్క విధమున, వనులలోన
మఱియొక విధంబున చరించు పురుషులందు
మేటివని తేల్చుకొంటి; నీ నాటికైన
తొలగి పోనిమ్ము నన్ను నీ వలపు చాలు;

సాంస:- డెలీలా!

* చేరగ దీసినావు; నవ జీవన వృక్షము పల్లవింపగా
నీరము బోసినావు; తరుణీ! యిపుడిట్లు దయా విహీనవై
నేరము మోపి నన్ తరుమ న్యాయమె! ప్రాణము లిచ్చియైన నీ
కోరిక దీర్పకుందునె! నిగూఢము లైనను వెల్లడింపనే!

డెలీ:- ఎందుకీ బులిపింపు మాటలు నిజము. చెప్పదలంచిన చెప్పుము

సాంస:- సఖీ! నీవే సర్వస్వమని నమ్మితిని; నీటముంచినను పాలముంచినను నీదే భారము, సత్యము చెప్పుచున్నాను వినుము.

నా తల్లి సంతాన మపేక్షించి యెహోవా దేవుని ప్రార్థింప
నా దయామయుని పంపున నొక దేవదూత ప్రత్యక్షమై మా యమ్మతో

నిట్లనియె:

* "పుణ్యవతి! నీదు గర్భాన పుట్టబోవు
కొడుకు శిరమును క్షురికతో గొరిగిన యెడ
బలము నశియించు; నా పని సలుపరాదు
దేవదేవుని మహిత సందేశమిదియె!"

అని చెప్పినదట—అందుచే నా తలవెంట్రుకలు తీయించక పెంచినాను వీనిని కత్తిరించినచో నేను బలహీనుడనగుదును.

**డెలీ:—** ఆ ... అట్లులనా! నేటికి నిజము చెప్పితివి; భోజనమునకు వేళ యైనది లెమ్ము,

(నిష్క్రమింతురు)

(పొదితో మంగలి ప్రవేశము)

**మంగలి:—** నేనంటే మామంచోణ్ణని ఊరంతా అను కొంటది గాని మా యాడది మాత్రం లెక్కలో యేసుకోదే! అసలు నాకు పెండ్లొద్దంటె మా అయ్య వూరుకున్నాడా! నా చెవులు మెలేసి ఏరిగ పిల్లంటి మామేనత్త కూతుర్ని దెచ్చి గుది కొయ్యలాగా నామెడను కట్టేడు.

అదింట్లో కాలు బెట్టింది మొదలు నాగరమని నత్తని బులాకని బురిటీలని ఇంకా యేందేందో కావాలని ఒకటే పోరు. తలగొరిగితెచ్చిన డబ్బులు చేతికిస్తే మళ్ళి ఒక్క పైసాగూడ సూపించదు. దాన్నొదిలి పెడగా మంటే మాయయ్య నా కాళ్ళిరగ గొడ్తాడు. ఏంచెయ్యను? దాని తసాదియ్య బంగారమంటే మా లావు ఆశ మాయాడదానికి ఇదిగో యీదెబ్బతో గాని దాని ఆశదీరదు.

సర్దారయ్యలు చెప్పినట్లు—డెలీలా యింట్లోవున్న సాంసనయ్య కునుకు మీదున్నప్పుడు తలగొరిగితే కావాల్సినంత సొమ్ము చేతి కొస్తుంది. అయితే! జాగ్రగా గొరక్కపోతే సాంసనయ్య చేతిలో మసై పోవాల్సిందే! గొరక్కుండా వుంటే సర్దారయ్యలు సంపేటట్టుండారు. ఏంజెయ్యను? నాపెండ్లానికి కట్టిన తాళిబొట్టుకొడు గట్టిదై ఆ పైనున్నవాడు సల్లంగా సూతే యే తంటా లేకుండా నిదమీదున్న సాంసనయ్యను తలగొరిగి రాగలను, అనేగా డెలీలమ్మ యిల్లు – పోతాను పోయి సూత్తాను.

(నిష్క్రమించును)

# పంచమాంకము - రెండవరంగము

(డెలీలా తొడపై సాంసను పరుండి యుండును అప్రక్కనే మంగలినిల్చి యుండును; తెరయెత్తగా మంగలి లోనికేగును)

డెలీ:- సాంసనూ! సాంసనూ! ఫిలిస్తీయులు వచ్చుచున్నారు, లెమ్ము లెమ్ము!
(అని డెలీలా లోనికేగును.)

సాంస:- (నిద్రలేచి తల దడివికొని) ఓసీ! ఘాతకీ ఎంత పని చేసితివే! నా బలమునకు కారణమగు శిరోజముల గొఱిగించి నన్ను విరూపిని చేసితివా! నన్ను కౌగిలించిన నీ చేతులతోడనే నాశత్రువులకు అప్పగింప బూను కొంటివా!

పాతకీ! దిన దిన ప్రవర్ధమానమగుచున్న మన అనురాగలతాంతమును క్షణములో నెట్లు కాలరాచితివే! నీలో దానవత్వమే గాని మానవత్వము లేదు. వంచనయే గాని మంచితనము లేదు. నీ హృదయము లోతైన గొయ్యి! నీజీవిత మొక సుడి గుండము.

నీ మాటలను అమృతపు తేటలను కొంటినే గాని కత్తిపోటులని గమనింపనైతిని; నీ చేతులు గొంతు కోతలని నేటికి తెలిసి కొంటిని. నమ్మి నీ యిల్లు చొచ్చిన నన్ను కాళ్లు చేతులు గట్టి నడి సముద్రమున బడవేసితివి. వేశ్యలపొత్తు వలదని యెందఱు చెప్పినను వినక చెడిపోతిని; దుర్మార్గురాలా! నన్నిట్లు చేయ నీకు మనస్సెట్లొప్పినది. అదిగో! సర్దారులు వచ్చుచున్నట్టు చప్పుడగుచున్నది. నేనిందుండి తప్పించుకొనిపోయెద (లేవబోయి శక్తిలేక క్రింద బడును) అయ్యో! నిలుచుటకు గూడ శక్తిలేని వాడ నైతిని; ఎట్లు తప్పించుకొని పోదును?

1సర్దా:- ఎటుబోవుటకును వీలులేదు. శక్తి గోల్పోయి నీవు మాచే జిక్కితివి.

దేశ స్వాతంత్ర్య మనుచు విద్వేషమూని
పాలకులపైని ఘోర విప్లవము రేపి.
దొంగవలె దాగి నేటికి దొరికినావు:
ఏరికైనను కాలంబు మారి పోదె:

2సర్దా:– * ఓరి! సాంసను స్వేచ్ఛా విహారి వగుచు

పట్టుబడి తప్పుకొని తొల్లి పారి పోతి
విప్పుడే మందు వింక దిక్కెడనీకు
బలము కన్న గొప్పది బుద్ధి బలము కాదె!

సాంస:– అయ్యో! రాహు గ్రస్తమైన చంద్రునివలె నాస్థితి యెంత దుస్భరమైనది.

* ఘోర శత్రు సంఘంబులు పా పోవ
దివ్యబలంబున నే ప్రవర్తించి; నేడు
వార కాంత మాటలు నమ్మి పట్టుబడితి;
దైవ కృతమొ! సైతాను శోధనమొ! యెఱుగ;

సర్దారులారా! ఈ తెలవంటి పోటు మాటలతో నన్నేల నొప్పింతురు. తగిన శిక్షవిధించి మీ కసి తీర్చుకొనుడు.

1సర్దా:– (రెండవ సర్దారును చూచి) సాంసను ప్రాణములు తీయుటకు ప్రభువుల కే గాని మన కధికారము లేదు గదా!

2సర్దా:– ప్రాణముల దీయుట కధికారము లేదుగాని కాళ్ళు చేతులు నరికించుటకును కండ్లూడ బెరికించుటకును మన కధికారమున్నది. కనుక యితని కండ్లు తీయించి గాజా జైలులో పడవేసి ప్రభువులకు నివేదింతము.

1సర్దా:– దాగోను దేవతా మహోత్సవములు సమీపించినవి. ఆయుత్సవమునాడు దేవతకు సాంసనును బలి యిచ్చునట్లు మహారాజు గారితో విన్నవించు కొందము.

2సర్దా:– ఓరీ సాంసనూ! రా! నీ కండ్లు తీయించి గాజా జైలులో వేసి విశ్రాంతి లేకుండ నీచేత పెద్దతిరగలి త్రిప్పించక పోతే మేము సర్దారులమా?

(బంధించి సాంసనును గొనిపోదురు. తెరబడును)

(గాజా జైలు: గ్రుడ్డివాడైన సాంసను ఒక పెద్దతిరుగలి
విసరు చుండ భటులు కొరడాలతో కొట్టుచుందురు)

సాంస:—

* కన్నులు దీసినారు; వడిగా చెఱసాలను ద్రోసినారు; నా
కన్నము పెట్టరారు; క్షణమైన ఘరట్టము ద్రిప్పుకున్నచో
తన్నుట మానుకోరు; సరదారుల హింసభరించుటెట్లు? నా
కున్న బలంబు సన్నగిలె! నో పరమేశ్వర! నన్నుబ్రోవరా!

ఓ దేవదేవా! ఫిలిస్తీయ పిశాచ పాలనమునుండి నా స్వజాతీయులను రక్షించు ప్రయత్నమును విడిచి ఎలుకల బోనువంటి వేశ్యా గృహమున కాలుబెట్టితిని, తత్ఫలితముగ పంచేంద్రియములలో ప్రధానమగు కన్నులనే కోల్పోతిని;

ప్రభువా ! ఈదుష్టునకు తగిన దండనమే విధించితివి. కన్నులుండి మాత్రము నేనేమి చేయగలిగితిని. ఇశ్రాయేలీయుల బానిసత్వము ను తొలగింపగలిగితినా! స్వాతంత్ర్యావతరణమును చూడ గలిగితినా? తండ్రీ! కన్నులుండియు చీకటిలోనే జీవించితిని; ప్రకృతిలోని ప్రత్యణువునందు ప్రతి బింబించు నీ పవిపత్రరూపమైనను పరిశీలింపనైతిని. నా పశుబలమునే నమ్ము కొంటిని సర్దారులు నా చర్మచక్షువుల బెరికించి గ్రుడ్డివానిగా జేసినను నా ఆత్మకు కనువిప్పేకలిగినది. ఎండమావులవంటి కోరికలపై నేవగింపు జనిం చినది. కోటిసూర్యప్రకాశమానమైన నీ దివ్యతేజస్సును ఆత్మ దృష్టితో వీక్షించు భాగ్యము లభించినది.

నను బోలు వీరయువకులారా ! నా మాటనాలకించండి జల గలవంటి వేశ్యల సంపర్కమును కలలోనైనను తలంచకండి; చూచుచుండగనే వారకాంతలు పురుషుల ధనమానప్రాణములు హరింతురు.

పరమేశ్వరా! నేనీబాధభరింపలేను. అరిషడ్వర్గమున కాలవాలమైన ఈపాడు శరీరమును పాముకుబుసమును వలె నానుండి పత్యేకించి లోక నాటకమున నాపాత్రముగింపు చేయరాదా!

తండ్రీ. యీ కిరాతకులు కొంచంతతిరుగలి విసరుమని కొర

డాలతో గొట్టి నారక్త మాంసములు పిండు చున్నారు. ఇక నే నోర్చుకొనలేను, నా తప్పులు మన్నించి నన్ను నీ సన్నిధికి చేర్చుకొనుము.

మీరా:– (కొట్టుచు) హరె! తిర్గలిక్కి హిస్రూబే.

భటుడు:– హీయెద్వకి ముండా కావాల్సొచ్చింది; ముండ!

మీరా:– ఆ ముండ వీడిక్కి బొచ్చుగొర్గించి పట్టి హిచ్చింది.

భటుడు:– హరె ! భాయ్ ! రేపు వీడిక్కి మహారాజా వార్ హాజరు సెయ్యమన్నార్ కైకురే!

మీరా:– హరె! నీకు సొబ్బిమాలుంనై! రేపు దాగోను హమ్మవారిక్కి తిర్నాల్ సేస్తా హుండారు గదూ!

భటుడు:– తిర్నాల్ సేస్తే! వీడు దేవత్ హమ్మవారిక్కి మొక్కని హుండాడా

మీరా:– మొక్కుగిక్కునైరే! వీడిక్కి దేవతిక్కి బలిహిస్తార్

భటుడు:– కైకురే!

మీరా:– హమ్మవార్ వీడిక్కి పట్టి యిచ్చినందుక్కి

భటుడు:– పట్టి హిచ్చింది డెలీలా హయితే దాగోన్ హమ్మాను బల సెయ్యడం కైకురే! డెలీలాకే బలియిస్తే అచ్చాగా హుండదూ!

మీరా:– వీడ్ని దాగోన్‌హమ్మవారిక్కి బలిసేయమని మహారాజ్ హుకుంజారి సేసినాడ్.

భటుడు:– వీడిక్కిబలిసెయ్యక చోడ్ దాల్తో మనల్ని నల్లులిక్కి సంపినట్లు సంపుతాడ్ భాయ్! మొన్న గాడ్డి దవడతో యెయ్యిమందిన్ కొట్టి సంపినాడ్.

మీరా:– అరె! సాంసణ మాకీ మాటలేకుండా తిర్గలి హిస్రూబే రేపటితో నీ పీడ మాకి తొల్గి పోతాడి.

సాంస:– హా! సర్వేశ్వరా! నా కెట్టి దుర్గతి దాపురించినది.
గాంబ్రడించి పైదూకు కరివైరి నెదిరించి

సంహరించిన నాటి సింహబలము
గాజా పురాన దర్వాజ కమ్ముల బీకి
సర్దార తరిమిన సాహసంబు
గాడిద దవడ నొక్కటి గొని శత్రుల
ప్రాణాల బలిగొన్న పౌరుషంబు
బుసగొట్టి పైబడు విసపుపాముల నేల
కాలరాచిన పరాక్రమ విభూతి

నిన్ను విడనాడి గర్వించి నీతిమాలి
కుటిల వేశ్యాగృహాన పొగొట్టుకొన్న
కానని కబోది నైన నన్గావ రావే!
దివ్య మహిమా ప్రభావ శ్రీదేవదేవ!

భటుడు:— అరె! సాంసన్! నీ సంగీతంహాపి తిర్గల్కి జల్దిహ్నాసూబే కొరడాలతో కొట్టుదురు

(తెర వ్రాలును)



# పంచమాంకము

## (మూడవరంగము)

(రాజు, మంత్రి, సింహాసనాసీనులైయుందురు)

**రాజు:–** సచివవరేణ్యా! ఈ దాగోను దేవతాలయము నేనాడు కట్టించిరో గాని మోకుతిరగని రాతి స్తంభములతోడను చిత్ర విచిత్ర శిల్పకళా నైపుణ్యము తోడను చూడ జూడ కనులు మిఱుమిట్లు గొల్పు చున్నవి.

* సొగసుల రాశిబోసిన విశుద్ధ కరంబగు విగ్రహాలతో
ధగధగ లాడు పచ్చలను దాపినబంగరు గోపురాలతో
గగనమునంటి సద్యశము గాంచిన కోవెల; శిల్పకారులే
యుగమున గట్టిరో! మరణమొందియు వారు సజీవులే గదా!

**మంత్రి:–** ప్రభూ! ఇంత గొప్పదేవాలయము **మనదేశమున వేఱొండుకాను పించదు.**

* **జీవకళ** లుట్టి పడ భక్తి భావ మలర
ధనము వెచ్చించి బహుకాలమును వ్యయించి
శిల్ప సౌందర్యమిచ్చోట సిద్ధి నొంద
అందముగ గట్టినార లీ మందిరంబు;

మనతల్లియైన దాగోను మహోత్సవము లీనాడు నేత్రానంద కరముగా జరుగు చున్నవి. అదిగో! ప్రజలు తండోప తండములుగా వచ్చుచున్నారు.

రాజు:–ఇంత జనసమూహమును నేన్నెనడు చూచి యెఱుగను.

మంత్రి:– ప్రభూ! దేవతాలయపు టావరణము నందే గాక పైభాగమున రమారమి మూడువేలమంది స్త్రీపురుషులు నిండియున్నారు. ఈనాడు రాజద్రోహియగు సాంసనును దేవికిబలియిచ్చెద రన్నవార్తవిని జనప్రవాహము పొంగివచ్చు చున్నది.

* ఓ మహాజనులార దురూహ తోడ
ఖలుడు సాంసను జేసిన కార్యములకు
శిక్ష విధియింప ప్రభువు సంసిద్ధుడయ్యె
తీరు మన బాధలన్ని యీదినము నందె!

(సర్దారులు బధింప బడిన సాంసనుతో ప్రవేశింతురు)

సాంస:— కీర్తన

దరిసెన మీయగరావా! దేవా! దయగనరావా!
వరమున బుట్టిన — చరిత మెఱింగియు
దురితుడనైతిని దేవా! దేవా! దరిసెన॥

I కామ పిశాచిని కాదనలేక — నీమహితోక్తులనే జవదాటి
కన్నులు బోయిన గ్రుడ్డివాడనై — నిన్నే పిలిచితిదేవా! దేవా! దరిసెన॥

II పావనమగునీ పదములు మరచి — జీవితమును వృధ—జేసికొంటినే
కావగ రావా! గతియిక నీవే—ఈ వగ దీర్పగలేవా! రావా! ॥ దరిసెన॥

సర్దా:— ప్రభువులకు ప్రణామములు — మంత్రివర్యులకు నమస్కారములు

రాజు:— సర్దారులారా! ఈ ఖైదీని గొనివచ్చుట కింతతడవేలయైనది.

1సర్దా:— దేవరవారి యాజ్ఞాను సారముగా కారాగారమునకేగి సాంసమును రాజసన్నిధికి రమ్మని పిలిచితిమి. కాని యితడు దైవప్రార్థనానిమగ్నుడై మా పలుకాలకింపక మిమ్ముగూడ, తిరస్కరించినాడు

రాజు:— అంధుడైన బంధితుని గొనివచ్చుటకు సైతము మీకు శక్తిచాలక పోయెనా?

2సర్దా:— వీని యహంకార మణగించుటకై మదపుటేనుగు వెనుక భాగమున గొలుసులతో బంధించి మేమా యేనుగుపై నెక్కి ఈడ్చికొని వచ్చితిమి.

రాజు:— సెహభాష్, సర్దారులారా! మంచి పని చేసితిరి,

(సాంసను వైపుచూచి) ఓరీ! సాంసనూ!

• నేలను జీర్చియిమ్మహి జనించినదాది స్వదేశ మల్లక
ల్లోలము జేసి పాలకుల లోపములెన్ను దురాత్మ! నీకు, పో
గాలము దాపురించినది; గైకొనుమా! నినుపాతి పెట్టగా
జాలిన భూమి నిచ్చెద శ్మశానములోన ప్రశాంతి జెందగన్;

సర్దారులారా వీని దుష్ట చరిత్రమును నొక్కసారి ప్రజలకు వినిపించుడు,

1సాంస,– మహాజనులారా! ఈ సాంసను స్వాతంత్ర్యమను పేరుతో ఎందరినో! హత్యగావించినాడు. మత కలహముల రెచ్చగొట్టెను. తుదకు ఫిలిస్తీయ ప్రభుత్వమును కూల ద్రోయుటకు తిరుగుబాటు లేవ దీసెను. ఇతనిని బంధింప మనమెన్నియో ప్రయత్నములు చేసితిమి; నేటికి వేశ్యాలోలుడై మన హస్తగతమైనాడు.

2సర్దా:– వీడు ఇశ్రాయేలీయుల యెహోవాదేవుడే సర్వశక్తి కల వాడనియు, దైవ వరమున జనించినాననియు విఱ్ఱవీగి మనల నందరను బాధించెను.

* తన యెహోవాదేవుడే; ఘనుండని వచించి
మన పవిత్ర దేవత నవమాన పరచె
పరమ ఘాతకు డితని దైవంబువీని
జీవములు నిల్పునేమొ? చూచెదముగాక!

మంత్రి:– నీచాధమా! నీ కండ్ల కావరముచే కన్నులు కోల్పోతివి; అందుడవగు నీకింతవఱకు లోకము కనిపించదయ్యో; ఇప్పుడు లోకమునకే నీవు కనిపించవు.

రాజు:– ఓరీ! నిన్ను మాదాగోను దేవతకు బలిజేయ నిశ్చయించితిమి, నీకడ సారి మాటలున్నచో విన్నవించుకొనుము.

సాంస:– నేనేమి నివేదించినను మీ నిశ్చయము మారదు గదా! దేవుడిచ్చిన విజ్ఞానమును మంటగలిపి ఆయన చిత్తమునకు వ్యతిరేకముగా వ్యభిచారినై పాపము చేసినందులకు పశ్చాత్తాప పడుచుంటిని ఆ పరమేశ్వరుడు నా పాపముల మన్నించిన నాకదే పదివేలు. కాని ప్రాణములకు భయపడి, ప్రజలను పీడించు మీ పాదము లాశ్రయింపను; కాని ఒక్క మాట గుర్తుంచుకొనుడు. ప్రభువులనగా ధర్మపాలనము నిర్వహించు దైవ ప్రతినిధులు, అట్టిదైవ ప్రతినిధులే ధర్మమును వధించి స్వాతంత్ర్యమును కబళించినచో వారిరాజ్యములు చిరకాలము నిలువనేరవు.

రాజు:— చాలింపుము నీ వాచాలత్వము, నీ జీవిత నాటకము చివరాంకము లోనున్ననుగమనింపక మాకే నీతులు బోధించుచుంటివి.

మంత్రి,— పుట్టెను బుట్టిన బుద్ధి పుడకలతో గాని పోదు.

1సర్దా:— కుక్క తోక చక్క జేయ సాధ్యమగునా?

2సర్దా:— చింత చచ్చినను పులుసు చావ లేదు.

సాంస.— అయ్యో! నేనెంత నికృష్ట జీవనుడనైతిని; నాకండలు చెదరి పోయి నవి; నాగుండెలు కృశించినవి. నరముల పటుత్వము సన్నగిల్లినది. చిత్రహింసలతో నాశరీరము చితికి పోయినది. అబ్బా! దైహిక బాధ దుర్భరముగదా!

ప్రభూ! నిలుచుటకు గూడ శక్తిలేని వాడనైతిని. ఈ దేవ తాలయమున కాధారముగనున్న స్తంభముల నానుకొని నిల్చియుండ నను ఆజ్ఞయ చేయుడు, పిమ్మట మీయిష్టాను సారముగ సర్వము సమాప్తి చేయుడు.

రాజు:— సర్దారులారా! వీనికోర్కె మన్నింపుడు.

(సర్దారులు స్తంభముల చెంత సాంసను నుంచెదరు)

మంత్రి:— ఓరీ! ఇప్పుడు చింతపడిన నెవరికి జాలిగలుగును.

మాఫిలిస్తీయులను హతమార్చినట్టి
పాపభాండంబు నేటితో బ్రద్ధలయ్యె
ననుభవింపుము మాదేవతాలయమున
మొసలి కన్నీటితో మేము మోసపోము!

1సర్దా:— దాగోనుదేవత దయవలన దొరికినాడు. లేకున్న నింకెందరిని నాశనము చేసియుండునో!

2సర్దా:— అందుచేతనే వీనిని బలియిచ్చి ఆతల్లి ఋణము తీర్చుకొందము.

సాంస:— నన్ను చంపినగాని మీక్రోధము చల్లారదు.

మంత్రి:— దేశద్రోహము, రాజద్రోహము, దైవద్రోహము చేసిన నిన్ను ఒక్క సారిగా చంపక చిత్రవధచేసిన బాగుండును.

సాంస:— అధికార మదోన్మత్తులు మీరేమైనను చేయగలరు. ఇంతకు నేజేసిన దోషమేది? స్వాతంత్ర్య భయాహార నిద్రామైధునములు ప్రతిజీవికి జన్మసిద్ధములు. జ్ఞానములేని పశుపక్ష్యాది జంతు జాలములు సైతము విశ్వప్రపంచమున స్వేచ్ఛ ననుభవించుచుండ, సృష్టిలో నుత్తము

డగు మానవుడు స్వేచ్ఛాభిలాషియగుట దోషమా! స్వీయజనుల దాస్య బంధముల విడిపింప జూచుట నేరమా! మీవలె విగ్రహముల పూజింపక ఆత్మరూపుడగు దేవు నారాధించుట పాపమా!

మీదండనీతికి తలవంచక దైవబలముతో మిమ్మెదుర్కొంటిని. స్వాతంత్ర్యము నభిలషించితిని; కాని నాప్రయాస వ్యర్థమైనది. నాప్రయత్నము విఫలమైనది. కామోద్రేకమున కన్నుమిన్నెఱుంగక కామినీలోలుడనై దైవాశీర్వాదము పోగొట్టుకొని ననుగట్ట త్రాళ్లు నేనే తెచ్చికొంటిని. ఇయ్యది స్వయంకృతాపరాధమేగాని వేఱొండుగాదు.

తండ్రీ! యెహోవాదేవా! నీవర ప్రభావమున జన్మించియు నీచప్రవృత్తికి లోనై నీచిత్తమునకు విరుద్ధముగా నడచితిని, నేనపరాధిని నాపాపముల పరిహరింపుము.

పరమేశ్వరా! పశ్చాత్తాపపడు నీ దీనుని ఒక్కసారి జ్ఞాపకముచేసికొనవా! యీవులను వర్షించు నీదివ్యహస్తమునువిప్పవా! ప్రాణములపై నాశవీడితినిగాని పరాభవము సహింపలేక బాధపడుచున్నాను. దయామయా! నాకండ్లూడబెరికి, నిన్ను నీప్రజలను బాధించు ఫిలిస్తీయులపై పగదీర్చుకొనుటకు ఈతుదిగడియలో ఒక్కసారి నన్ను బలపరచుము తండ్రీ! బలపరచుము.

ఈదేవతాలయమును కూలద్రోయుటకు నాకు శక్తి ప్రసాదించి భౌతికదేహముపై విరక్తిగలిగిన నీనన్నుగూడ నీసన్నిధానమున జేర్చుకొనుము తండ్రీ!

నీవాత్సల్యము విస్మరించి
మదిలో నీసేవ వర్జించి నా
లావున్ నమ్మితి ; నేడు వంచకి
'డెలీలా' చేత నీలీల నా
జీవంబుల్ పరహస్తమైన విక
రక్షింపన్ దయావార్ధివై
రావే! పాపవిదూర! సూనృత
విచారా! సర్వలోకేశ్వరా!

(సాంసను స్తంభములను ఊపి మందిరమును పడద్రోయును)

(అందరు చనిపోయెదరు తెరపడును)

మంగళము